కావ్యగ్రంథమాల—నాలుగవ గ్రంథము.

# శృంగారపంచకము

K. Gopala Krishna Rao
Rajahmundry
31.12.60

ఇందుగల గ్రంథములు

జాబులు
గ్రంథకర్త
సెట్టి లక్ష్మీనరసింహం
సరసోక్తియుక్త
కృష్ణ శతకము
గ్రంథకర్త
సెట్టి లక్ష్మీనరసింహం
రసికాభిలాషము
గ్రంథకర్త
కవిసార్వభౌమ
శ్రీనాథుఁడు
సరసచాటువులు
గ్రంథకర్త
సెట్టి లక్ష్మీనరసింహం
పూర్వకవులు
చాటువులు



చందాదారులకు మాత్రమే.
పోస్టు ఖర్చులు సహా
వెల రు 1-4-0

## భూమిక

మ. రా. రా. శ్రీ సెట్టిలక్ష్మీనరసింహము గారిచే రచింపఁబడిన 1 జాబులు – మొదటిభాగము. 2 జాబులు – రెండవ భాగము. 3 వరసోక్తియుక్త కృష్ణశతకము. 4 వరచాటువులు, 5 కవిసార్వభౌమ శ్రీనాథకృతమగు – రసికాభిలాషము. ఇంక ఇతరకవులచాటువులు. ఈయైదింటి నిందు ముద్రించి శృంగారపంచక మని నామకరణ మొనర్చి 4వ గ్రంథముగా వెలువరించితిమి. కావున మాచందాదారు లెల్లరు సాదరముగా నాదరింతురని తలంచు చున్నారము. మాకు సర్వహక్కుల నొసంగి యీశృంగారపంచకమును మాచే వెలువరింపఁజేసిన శ్రీ శ్రీ శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారి కెంతయు కృతజ్ఞులము.

స్వవిషయము:— ఆంధ్రరతిరహస్యము కొఱకు చందాదారు లంద ఱాత్రముతో వ్రాయు జాబు లందుకొను చున్నారము. రతిరహస్యమున మేము ప్రకటించిన యర్థశాశీతి కాక మిగిలిన యర్థచాశీతి బొమ్మలు మా యశ్రద్ధవలన చెదపురుగుల పాలాయెను కనుక సంభోగసమయమున నిజముగాఁ దీయ బడిన యన్యదేశీయుల ఛాయపటముల నుండి చేయఁ బడిన చిత్రములతో నాంధ్ర రతిరహస్యమును వెలువరింపఁ దలఁచితిమి. ఇంక నాలుమాసములలో 5 వ గ్రంథముగా నాంధ్ర రతిరహస్యమును వెలువరింపఁగల మని చందాదారులకుఁ దెల్పుకొను చున్నారము.

10-12-1922<br>
దుందుభి 8 — ఇట్లు యస్. చిన్నయ్య.

———

శ్రీ ర స్తు.

# ★ జా బు లు ★

## మొ ద టి భా గ ము

శ్రీమద్రమాకుమార స
తీమహితవిలాసవతిని దీర్ఘాయువుగా
ప్రేమంబున దీవించుచు,
ఆమోదటఁ బ్రియుఁడు వ్రాయునది యేమనఁగా.

ఉ, ఏనిమిషంబునందు నిను నేఁ గనుఁగొంటినొ యంతనుండి నా
మానసమన్యచింతలను మాని, యదేమి కతంబొగాని, నీ
పైనె స్థిరంబుగా నిలిచి, పంతము పట్టినయట్టి చూడ్కి నీ
ధ్యానముతప్ప వేఱువిషయంబులు తోఁపగ నీయదో చెలీ. 2

చ, రమణుని నాల్కపై నొకతె సరస్వతిమాత్రమె సంతతంబు వా
సము నొనరించు నందు; రది, సత్యముకాదు, మదీయజిహ్వపై
రమణి చిరనివాసంబుగ నిరంతరమున్ వసియింతు వీవు ధ్యా
నము జపమున్ ఫలించి, మఱి నాకు లభించుత నీదు పొందికన్. 3

ఉ. ఇందిర యొకర్తె తాను హృదయేశుని డెందము పాయ దన్న పే
రొందె నటంచు లోకు లనుచుందురు, నీవును గాపురంబు నా
డెందము నందుఁ బెట్టి కదలింపవు కాలిని నిన్ను నాదు భా
గ్యేందిర యందునో, స్మర జయేందిర యందునో! సుందరీమణీ. 4

చ, నగముశరీర మొక్కటె కొసంగె, శిరంబునఁ దాల్చె నొక్కటెన్
తగులము కల్గి యీశ్వరుఁడు తన్విరో, నేఁను నీ నిమిత్తమై
నగ మయితిన్, భవచ్చరణ సారసముల్ శిరమందుఁ దాల్ప నం
టిఁ గనుకఁ గైకొనంగదవెనీ హృదయేశ్వరుఁగా గృపన్ ననున్

ఉ, కన్నులు వేయి యింద్రునకుఁ గల్గుట నిక్కము గాదొగాని, వే
గన్నులు నేను బెట్టుకొని గౌతమునాతిని బోలు రూపసం
పన్నను, నిన్నుఁగందుఁజుమి, భామిని నీ యెడ లెల్ల రాయి గా
కున్నను,నకటా! హృదయ మొక్కటి మాత్రము రాయియే
యగున్. 6

ఉ. చాలరు నీకుఁ గంతు దొరసానియు, మంతన కెక్కినట్టి యా
వేలుపుసానియున్ వరస విభ్రమరూప విలాససంపదన్,
లోలవిలోచనా, జగతిలో దొరసానులు సాను లెల్ల నీ
కాలిని గల్లు గోళ్ళ కెనగా రిఁక జక్కనిచుక్క లైసనుల్ 7

—♦ ( గొలుసు సీసము ) ♦—

సీ. ఓ బళా! యో యబలా నీ కులుకులు! రూ
పునను గోవునను నిన్ బోలరు వర
లోకమున కులుకులును, వేలుపుఁ జిలుక
లకొలుకులు, సహాబళా! మదనుప
దను ములుకు లగుఁ గదా నీ కనుబెళుకు
లు! బళిబళీ ! నీ జిలిబిలి పలుకు
లు! పులకండపలుకులు, బళీ! నీ మేయ తళు
కులు తొలి మెఱపులకుం గరపుఁ గ

తే, గీ ళుకులు, మొగము వెన్నెలలఁ జిలుకును, పెదవి
తుంఘి రొదవి! మధు వొలుకును, వ్యథిని నె
తేరు లసిత కాంతులతో జలకును, ముంగు
రు లళికులమునకు నమకారుచు నలుకును. 8

ఉ. సమ్ముక సుమాస్త్రి నానగ ఘనమ్మనుమా సరవేణి, మేను నూ
నమ్మనుమా, ముఖమ్ము నళినమ్మనుమా, చిఱునవ్వు నవ్య ఫే
నమ్మనుమా, కెంజిఱుంగు రతనమ్మనుమా యధరమ్ము, చూపు మీ
నమ్మనుమా, మృగాక్షి గగనమ్మనుమా నడుమగాదు నీ కటీ। 9

ఉ. చిల్వలరాయ డూడిగము చేయఁగ వచ్చును నీదు వేణికిన్,
కల్వలవిందు నీ మొగము కన్గొని సంతస జో హుకమ్మునన్
కొ ల్వొనరించు నీదు తళుకుంగనుదోయికి గండుమీలు, నీ
చెల్వము నెన్న నల్వకును చిల్వలఱేనికి నౌనె చెల్వరో. 10

ఉ. కోకిలకాకలీధ్వనులకున్ గురుపీఠము నీదుకంఠ మిం
తీ, కలహంససంతతికి నీ గమనం బునదేశకర్త, నీ
యాకృతి మేనకాదిలలనాంగులకున్ బడి పెద్ద, యద్దిరా!
నీకడ నేకదా యొరులు నేర్పులు తీర్పులు నేర్చు కొనరే. 11

సీ. కడుపునఁ గన్నట్టి గారాబుబిడ్డలు
ములుకతుమ్మెదలు నీ ముంగురులకు,
దరిఁ జేరి తుఱ్ఱిళ్ళిడి దగ్గరచుట్టాలు
గండుబేడిసలు నీ కన్నుఁగవకు
చెవిలోన మంతనాల్ చెప్పునేస్తంబులు
పదరుకోయిలలు నీ పలుకులకును,
అడుగుల మడుగులొత్తెడి పనికత్తెలు
చిగురుగుత్తులు నీదు చేతులకును,
ఆ. వె. ఒదిగి మెదిగి తిరుగు చున్నట్టి యాశ్రితు
లంచగములు నీదుయానములకు,
జాతిబందుగులు పసందైన జాజులు
పలుకులాడి, నీదు పలువరుసకు. 12

ఉ. దాన సువర్ణదానమును సల్పును నీదు శరీరకాంతి, భూ
దానము సల్పు నీ కటి, సదా తిలదానముసల్పు నాస, యో
రా! నిరతాన్నదాన మమరాళికి సల్పును నీదు మోవి యున్,
నే నిను నీవి వేఁడితిని నీవిఁక లే దనఁ బోకొసంగుమా. 17

చ. రజముతు దాల్చు పుష్పనికరంబును, చెమ్మను బూను పల్లవ
వ్రజమును, తేజముం గల సువర్ణము, గాలికి నూఁగు తీఁగ ల
భ్రజనితమైన క్రొమ్మెఱుఁగు పంక్తియు నీ తనువందుఁ గూర్చి ని
న్నజుఁ డటు పంచభూతనిచయంబునఁ సృజియించెఁ గోమలీ. 18

ఉ. తేనె యనంటిపండ్లఁ గల తీయఁదనంబుల దొండపండ్లలోఁ
గానఁగ వచ్చునేని, యటుగాక యనంట్లకు దొండపండ్ల కిం
పైనను గల్గెనేని, సరియౌ ననవచ్చును నీదు మోవికిన్,
మానిని! నీ బెడంగు లసమానము లై విలసిల్లు సృష్టిలోఁ. 19

ఉ. తామరతూండ్లటంచును, లతాయుగమంచును, బువ్వుదండలం,
చీ మొయి నీదు బాహువుల నెన్నుదు రన్నివిధాల వందఋన్,
కాముఁడు నీకుఁజిక్కె నను గట్టిగఁ గట్టిన మోహపాశము
ల్గా మది నేఁ దలంచెదను గామిని, గంధగజేంద్రగామినీ. 20

చ. ఇలపయి నీదు కౌను గుఱించి వివాదము లుద్భవిల్లఁగా,
కలదని, మింటికిం బయిని గ్రాలు నటంచును గొందఱాస్తికుల్
పలుకుదు రద్ది కేవల మబద్ధ, మొకింతయుఁ గాను పిడుఁ దో
య్యాలి, సఖీ, లేదు, లేదనుచు నాస్తికవాదము లిను సల్పెదన్. 21

చ. మదమూదంతి పోటకు సమంబుగ నీనడ లేన్గు నెన్నడల్
గద తోడ లేన్గుతుండములె, గండదుచుల్ కరిదంతతుల్యముల్
గద మఱి యొక్క-సామ్యమును గద్దది చెప్పితినేని, నీకు సి
గ్గౌనవు నటంచు డంకుపొయి మూరకయుందుఁ బకోరలోచనా, 22

ఉ. లేతగులాబిరేకుల వలెం జెలు వాఱును నీ కపోలముల్,
వాలెఱ జాతికెంపవలెఁగ వచ్చును, సంపెంగ వాస, చంద్రులో
పాలిక నన్నొసల్, కనులు పద్మదళంబులు. శ్రీలు కర్ణముల్
నాతి, భవన్ముఖంబు నలినంబుల వైరియె యెల్ల రీతులన్. 23

శా. పట్టాక్షౌమె సుమ్ము నీదుజడ, యాపై కన్బొమల్ విండ్లు, య
ట్టింట్టం బర్వెడి చూపులమ్ములె, యహా రే! నీయొయ్యారంబులే
కొట్టన్ వచ్చిన యట్టివాడ్కగను నాకుం జూడఁ జూడంగఁ జూ
పట్టెన్. నిన్ శరణంటి నన్ గనుఁ జేపట్టంగదే యంగనా. 24

సీ. గిరగిర నీదు ముంగురుల సుళ్ళంబడి
మరలలేకుండె నా మానసంబు,
బిరబిర నీదు బిత్తరపుఁ జూపుఁదూపు
గములు నాఁటెను నాదు గుండెయందు,
గరగర లాడు నీబిగువు పయ్యెదవల
లోఁ జిక్కువడియె నా లోచనములు,
జరజర నీదు కేశంబులం దొంగు చీఁ
కటి నాకు కామాంధకార మయ్యె,
గీ. పరపరన్ గుత్తుకను గోయు కిరుసకత్తి
యూచు నీదు కీల్జడ నాకు దోఁచుచుండె
చురచురన్ వెన్నెలట్లు నీ చిఱునగవును
సోఁకుచుండె నా తొఁకో సుందరాంగి. 25

చ. విరిసెనపూవు వూని భవదీయశరీరము, నీదు నేత్రముల్
విరిసిన కల్వపువ్వు, లరవిందము నీవదనంబు, మల్లెపూ
వరుసను బోలుఁ బల్వరుస, వాలెఱ మంకెన, పువ్వుబోఁడి, నీ
విరిసెన మబ్బు మున్ను సుమధ్వనుని బువ్వులఁ బూజచేసినన్. 26

సీ. చక్రసామ్యంబు నీ జఘనప్రదేశ మొ
క్కటికె కా, దింక రెండిటికిఁ గలదు
దాడిమీబీజము నీ దంతవితాన మొ
క్కటికె కా, దింక రెండింటికిఁ గలదు
కరులతో వాదు నీగమనవిలాస మొ
క్కటికె కా, దింక రెండింటికిఁ గలదు,
బింబరూపము నీ పెదవి చక్కఁదన మొ
క్కటికె కా, దింక రెండింటికిఁ గలదు
గీ॥ తరుణి, సంఖ్యచే రెండని ద్వైతముగను
చెప్పుటే గాని, సరిగ చర్చించి చూచు
వారి కెల్ల నభేదభావంబు తోఁచు
చుంట నద్వైతముగఁ జెప్ప నుచితము మొ. ౨౩

శా॥ నాకెంతో రతనాలదుద్దులును, సొన్నాటంకపుం జేరు, వి
న్నాణంబొప్పదు చేరుచేత జిగినీ నామున్ సువర్ణంపు టొ
డ్డాణంబుల్, రకమైన నాగరము మెల్వంకీలునున్, కంకణాల్
రాణింపన్ మసురాశివాస మన నా రాణీ, విరాజిల్లదే. 24

ఉ. కామిని, పచ్చపట్టురవికన్ బిగి గల్గ ధరించి, మేలి బొ
లామణిచీరఁ దాలిచి, తళత్తళ లాడెడి దుద్దు లాదిగా
హేమవిభూషణప్రతతు లెన్నిరొయి మేనున బూని నట్టి నీ
గోము తలంచుచున్ మఱవు గొందుఁగదే యితరప్రపంచమున్.

శా జాకెట్టున్ జలతారుచీరయును భూషల్ దాల్చి, దోసాకరుల్
చేకొట్టం గలమోముతో వెలయు నీ చెల్వంబు వీక్షించినన్
వాకట్టం గద మొట్టవారికిని, చెల్వా నిల్వకే యిట్టునో,
శాశ్వంతమవో? నీమసంబు వశ మెందండేయుమా నాతినీ.

చ. విపులము గాఁగ కుచ్చెళులు వీఁపులమధ్యన శోభచుండ పైఁ
టవరికిణిం గట్టుకొని, దగ్గఱపింజలు కల్గినట్టి స
న్నపు తెలిరైకయుండఁ దొడిగి, నాఁడెపుగుమ్మటమట్లు నీవు నా
కెపుడును దోఁచుచుందువు గదే జగదేకవిలాసినీమణీ. 27

ఉ. జాఱుగ కేశముల్ ముడిచి చక్కనిదొక్క గులాబిపువ్వు పైఁ
జేరిచి, బాగుగా చలువచేసిన తెల్లనిచీరఁ గట్టి, క
బ్బ్రవికన్ ధరించి, మొయి భారపుసొమ్ములులేని నీదు సిం
గారము కన్నవారలకు కన్నులపండుగ కన్నెమిన్నరో. 28

చ, వదులుగ వల్లినట్టిజడ, వంగి మొగంబున మూఁగుముంగురుల్
నుదుటి సిలాయిచుక్కయు, కనుగవ కాటుకరేఖ, సన్నపై
పొదలెడి తెల్లపుట్టమును ఫుక్కిటవీడెము చేతనెఱనౌ
పెదవియు, నీకు పెట్టియును బెట్టనిసొమ్ములు కావకొమ్మరో. 29

ఉ. బాపురె! నీమొగంబునకు పౌడరు చల్లుటయేల! సబ్బుతో
రాపిడియేలమేని! కధరంబునకుం దములంపుఁ గెంజగెం
దోఁపగ జేయుసేల! కనుదోయికి కాటుకయేటికి? కో పదం
తీ! పునరుక్తిదోషమున కివ్వి యుదాహరణంబు లౌఁ జుమీ.

చ. దిటముగనల్లి గుండ్రముగ దీర్చినకీల్జడ యొక్కమారు, వ్రేల్
జట యొకమాఱు, గుత్తముగు జార్ముడి యింకొకమాఱు, మేలిము
చ్చటముడియొక్కమారు, కడుచక్కనికొప్పిక యొక్కమారుగా
కుటిలకచా, ధపత్కచము గూర్తువు నామది చిక్కఁపొందగన్. 31

చ. విరియని మల్లెమొగ్గ లొకవేళను, వీడిన యిట్టిసంపెఁగల్
మఱియొకవేళ, చక్కని గులాబులు వేరొకవేళ, కేదగుల్
మఱియొకవేళ గాఁగ కుసుమంబులు వేణిని దాల్చి పువ్వుబోఁ
డిరో, పువ్విలుతునారసము కేవను నాఁకెదు నామనంబునన్. 32

చ, సగము సరీరమున్ తలుపుచాటున దాఁచి, సగంబు వీధిలో
కగపడు నట్లుగా నహరహంబును నిల్చినయట్టి నన్ను ర
క్తిగఁ గనుచుండుటన్ భ్రమరకీటక నీతిని నాశరీరమున్
ముగుద సగంబె యయ్యెఁ బరిపూర్ణకృపం గనిపింపుమా యిఁకన్ 33

ఉ. వేళ(వారని, స్నానమయి పెన్నెరులం దడియార్చి మేడపై
కేశచయంబు చిక్కుతొలఁగించుచు నీవు పచారు చేయుచో,
రాశిగనున్న మబ్బులఁ దొరంగు శశాంకునిబోలు నీ మొగం
బాశ మదీయదృక్కువలయంబులకుం గలిగించు వ్యథ మే, 34

శా. డాబామీఁదను సంధ్యచీకటికతిన్ డాపొప్పఁగా నీవు ము
స్తాబై చల్లనిగాలికై దిరుగఁగా, స్వర్లోకమందుండి రం
భాబింబోష్ఠి యొకర్తె యేగుదెంచెనని విభ్రాంతిన్ దలంతుంగదే!
రేపో బాలా! నిను గోరకుండెడి శుకం దుర్వ్యస్థలిం గబుసే. 35

ఉ. అన్నము ముందుపెట్టుకొని యందముగాఁ గనునీవు పాపటన్
దిద్దుచు నుండగా, తెరువ దేయని చొచ్చిన నాదుచూపులో
ముద్దియ, రెండుచెంపలక యూఁగి నొసంటకిసాఁగి చెక్కలన్
గొద్దిగ, నాఁగి, మోముపంబు గ్రుమ్మరసాగెను జావలంబునన్. 36

ఉ. గానకళావిశారదవు గావున చల్లనివేళ, ముందు హా
ర్మోనియుమీవు పెట్టుకొని మోహనగాత్రిరో, జంత్రిగాత్రముల్
వీనులకొకరీతి వినిపింపఁగఁ బాడిన పాటచేత నా
మానసమందు కోర్కె పలుమారుచిగిర్చె, ఫలించు టెన్నడో. 37

ఉ. బాలిక స్నానముల్ సలిపి, పట్టుదుకూలము కట్టి నీవు దే
వాలయ సీమచేర నుపవాసముచే పసివాడి ముచ్చటం
బాలఁగ గొల్పు నీ మొగము చందము కన్గొని మోహమొంది,యా
వేళను నీదుపొందు నొదవింపుమటంచును వేల్పుఁగొల్చితిన్. 38

ఉ. చేతను బుస్తకంబులను జేకొని మెల్లగఁ బాఠశాలకై
రా తరళాక్షి, నీ వరుగుచున్నెడ, మన్మథబాధచేత నా
చేతము వ్రీలుచుండ, నినుఁ జేనయుఁ గుట్టినయట్లు గాదటో
భూతదయాగుణం బెనను బుట్టని నీచదు వేలఁ జెప్పుమా! 39

చ. నెలఁత, గొళాయి కేవఁగి నీళ్ళను బట్టుచు నిల్చియుండఁగా,
బొళబొళ మంచు గొట్టమున బుట్టిననీళులు నీదుబిందెలో
పలఁ బడినట్టిరీతి నతిపాత్రమవౌ నిను జూచి నామన
స్థలిని ద్రవించుకోరికలు ధారనుగట్టి స్రవించెనీపయిన్. 40

ఉ. బోటికొ, మొన్న నాటకము చూచుటకై చనుదెంచి, యచ్చటన్
బోటులలోల నిన్నుఁగని బుద్ధిమరల్పఁగ లేనివాఁడనై,
నాటక మేమిటో యెఱుఁగ, నాయికవీవగు చిత్రనాటకం
బాటగ మన్మథుండు నను వాఁడగ జేసెను సూత్రధారుఁడై. 41

ఉ. సంబరమీవు చూచుటకు చక్కనివేషముతోడ బండిలో
నం బయిఁ గాన్యమించుగ కనంబడునట్లుగ వంగియున్నచోఁ
శంబరనేత్ర నేత్రములు నావుగవిప్పుచు నిన్నుఁజూచుటే
సంబరమయ్యె నాకు, నయిసంబర మతియు వ్యర్థమీమమీ. 42

శా. బొట్లంజెప్పఁగ భూపితాంగి నగుచుం బువ్వుల్ పట్టపు టే
న్గట్టి వేగుచునుండ. దీపపువెలుగందున్ నినున్ గాంచి, చీ
కట్లన్ నీమొగముగారునవ్వులె తొలంగంజేసెనో. లేక గా
స్లైట్లమాలను ద్రోసెనో, యెఱుఁగ నాశ్చర్యంబు కంటింజెలీ. 43

ఉ బందుగులింటి పెండ్లికయి బాలరొ నీవును నేనుఁబోయి యం
దనుఁ బెండ్లిసందడుల యందు మునింగి మెలంగఁగా, నదే
సందడియంచు నంటి మదిజ్ఞాపకమున్నదో లేదొ! నాఁటి యా
నందము నిన్ను నేఁ గలిసినంగద క్రమ్మరఁ గల్గగావలెన్. 44

చ. చిలుకలు పిల్లగాఁగ రొదసేయుఁ, బికంబులు కూయ, షట్పదం
బులు కడు మ్రోయఁ దీవగమిపూయఁగఁ బూవులు తావులీయఁగన్
గలిసి విహారమున్ సుమవనంబుల సల్పఁగ నేర నేని తో
య్యాలి, మఱి యీవసంతము నిరర్థకమే ఋతురాజమయ్యునన్.

ఉ. ఆతపతాప మొక్కదెస, నంగజతాప మింకొకదిక్కునన్
నా తను వేర్చుచున్నయది నాతిరో, గంధపులేపపూతలన్
శీతలమైన నీ యెదను జేరిచి తాపము బాపకున్న, నే
రీతిగ నాతరం బగును గ్రీష్మదినంబుల నెల్ల దాటగన్. 46

చ. జలదము మూసిపెట్టి దివసంబుల రాత్రులఁ జేయుచుండ, లో
పలియడు గించుకేనియును పైకిడ నీయని వాన జోరుగా
ఇలఁబడుచుండ, వెచ్చఁదన మిచ్చెడి యింటను రేపవళ్ళు నిన్
గలిసి సుఖింపగా మదిని గాంక్ష యాశించెను గామినీమణీ. 47

ఉ. నీరదపంక్తిలేమిని వినిర్మలమౌ గగనస్థలంబునన్
శారదపూర్ణచంద్రముఁడు చల్లెడి చల్లని చంద్రికల్ భవత్
స్మేరముచే నిరర్థకత చెందుచునుండఁగ, నిన్నుఁగూఁడి యిం
పారగ నుభాంగి, వెన్నెలబయిళ్ళ సుఖించుట యింద్రభోగమే. 48

ఉ. ఇంతయు సందు లేక బిగియించిన గాఢపు కౌగలింతలన్
సంతస మీవు నా కొసఁగ సమ్మతిలన్ వలె నట్లు కానిచో,
కాంతరో, మంచుచే వడఁకుగల్గఁగఁజేసెడి దీర్ఘమైన హే
మంతపురాత్రులం గడప మార్గము లేదు మఱేద యేనియున్. 49

చ. కుటిలశిరోజ, దట్టమగు కుంకుమచర్చలచేత రక్తిమన్
దిటముగఁ బూసినట్టి భవదీయకుచద్వితయంబు లొమ్ముకం
పటులవిధాన కట్టుకొని, మానిని యీశిశిరంబునందు హ్రా
త్పుటమునమండిపుట్టు చలి పోవున యింక కేపాటుపడ్డలన్ 50

ఉ. వీధినిబోవ జెప్పులను వేయకపన్ కనుగొంటిగాని, నా
బాధయెఱింగి నీదు మది భావము తెల్ప తెల్పఁ దలంపవేమి! శ్రీ
నాథుని ద్రావిడాంగవల నైజముచూపక, యేనియేనియున్
సాధనముగా వచింపగదే సారసలోచన, గూడి కేళికిన్. 51

ఉ ఇష్టము నీకుగల్గినటు లించుకయేసియు నీవుపలుకు ని
స్పష్టము చేయకున్నయెడ, బాకులు కత్తులునై సుమంబులే
కష్టముపెట్టు నామదిని కామిని, నీదుకటాక్షమున్న దో,
ముష్టికరంబులన్ మరుఁడు మూలకు పాఱఁగనైవఁగావలెన్, 52

ఉఁ పేర్చక కేయుకుంటివిక జే భవదీయనునంబు నీదు ని
ట్టూర్పులు, పైటజార్పులు నొకొక్కపుడాకనుగొల్పు, నంతటనూ
మార్పులు నీ ప్రవర్తనమునం గనుపట్టి నిరాశపట్టు నే
నోర్పువహింప, దర్పకుఁడికోర్పు వహించునె దర్పహీనుడై!

చ, అడిగినయంత నొప్పుకొనునట్టుల కన్నడి, వేడి యంత ని
య్యెడఁ గడుబెట్టొనర్తు వహా! యియ్యదితొయ్యలి నీకెకాదు, మీ
యడఁ దుకజాతికంతకు స్వభావము, భావమెఱింగి నిన్ను నే
విడువకయుంటి, నేలకొనవే, యిటు బెట్టొనరింప నేటికే, 54

చ. అభిమత మున్న యట్టు లోకయప్పుడు, లేనటులొక్కయప్పుడో
యిభగమనా, కనంబడద వేటికె? కాంతలచిత్తముల్ జగత్
ప్రభుఁడె యెఱుంగఁగా నలయు కాంక్షకత్తము తెల్పకుంట, బె
ట్టో, భయమో? యిట్లుచంపఁగ నెటుల్ మనుమున్ మనసిచ్చియేలవే

ఉ నోటను నాకు తావకమనోవిధముం దెలుపంగ నిష్ట మో
మాటము కల్గె నేని, మునుమున్ కనుసైగలు లేవె? లేవె వ్రేల్
మీటులు? మందహాసములు లేవె! ఆ వేవియు చేతగానిచో,
చీటులు వేవె? పంపుటకు చేటులు లేరె? యుపేక్ష యేటికే. 56

ఉ. సిగ్గును గొంకునుంగలుగు చేడియ లుండరు! వారు నీవలెన్
దగ్గఱ చెంత చేరఁగనె దాఁగఁగ యత్నుఁ పాఱిపోదురే!

యిప్పుడైన, మఱిమెల్లగ కౌఁగిట నుండనేర్తువో!
దగ్గిన నూఁతుకున్న వనితా, మెటులేమ్మిన నిల్వనేరుచుఁ 57

ఉ. సిగ్గున గొంకు చుంటివో? చిన్నతనమ్మును జేసి వెన్కకున్
తగ్గుచు నుంటివో! చతురతన్, మఱియున్ మురిపించు చుంటివో
ముగ్గును జూపుచుంటివో? ముద్దియ, మత్కృత మైన దెద్దియో
యొగ్గు ఘటిల్లెనో! దయవహింపుము, దోసిలియొగ్గి వేడితిన్ 58

ఉ. గుట్టున నేమి దాచవని కొంకుచునుంటివో! యట్టులైన, నే
నొట్టును బెట్టుకొందు నిను మోచగి, నామది కాముఁడమ్ములన్
గట్టిగ గ్రుచ్చిచూచినను గప్పదకుండెడి లోతునందు నే
బెట్టి, భవత్స్వరూపమును బ్రీతినిగాంచెద దైవసాక్షిగన్, 69

మ. నెలఁతా, కాళ్ళకుఁగాఁక నే దిరిగితిన్, నిల్వంబడంగా, నదే
నిలబాంటింజాలి నిల్చుబత్తెముగ, నే నిద్రింపనే, లేదు రా
త్రిలయం, దిట్టగ నాశ్రయించితిని, నాకో బల్కు-నుం బల్కు-, నిం
దలిబాధన్ సగమేని వద్దనుల్లన్, స్వర్గంబె సాధింపనా. 60

ఉ. రోజనరోష్కరీతిని సరోజముఖి, చరియించుచుండు, న
వ్యాజకృపావిశేషము నొకప్పుడుచూపెద, వొక్కయప్పుడే
దే జగడంబు పెట్టుకొని యొద్దకు నైనను జేరనీయ, వ
న్నా! జవరాండ్రచిత్తగతులన్న, ఋణాఋణముల్ విడంబుగన్ 61

ఉ. సమ్మతి నీకు లేదని విటమ్ముగఁదోఁచిన, లేదటంచు స్ప
ష్టమ్ముగఁ జెప్పకుండఁ గనుఁగంపగ నేటికి చెప్పినంత, ప్రే
మ సొమ్మదవింపఁగాఁగలుగు మందులు ప్రేమికులు నెల్లఁ దెచ్చి న
శ్శ్య మొనరించుకొందు వనజాస్య, యవశ్యముగాఁగ నిన్నికన్. 62

శా. అంగీకారము లేనిచోఁ దెలుపరాదా! సాముదుర్ చావకుం
డఁగాఁ, గబ్బియుసైకమున్ నిరుగకుండగా నిటేలా! ప్రసూ
నాంగీ, నీపరపేక్ష తెల్పఁగనే, విస్మరించుకష్టంబు నా
కుం గోపంబుతు జూపుకష్టముగ నీకు, గల్గకుండుంగదా. 63

ఉ. దూతికతోడ నీకడకు తొయ్యలి, నేఁగబురంప, దానిపైన్
బూతులుతిట్టి పోలిఁతిటి! బుద్ధిహీనతయే, మఱొక్కతో
ఁ దెలుఁగా రహస్యమును నేనువచించుట; తప్పావచ్చె నేఁ
జేతులమోడ్చి మ్రొక్కితిని, చేసినదోసము సైఁచి తేలుమా. 64

శా. సంకేతస్థలి కేను ముందుచని, యో చానా, ఇంకన్ వత్తువో,
ఇంకేంత్తువో!" యంచు కాచికొని, నీవెన్నింటికిఁ రావు "ఆ
టంకంబేదియొకట్టి మానితివా, యిష్టంబుడమిన్ రావో!" యన్
శంకంబొందితి, మాకు కాగకలునిరాకల్ చేయ న్యాయంబటే! 64

ఉ. రాతిరిరాఁగ ప్రొద్దుటను రమ్మని, ప్రొద్దుటరాఁగ నింక నే
నీకోతటి రమ్మటంచు, నిటులో తరుణీమణి, నన్ను ద్రిప్పుచే
తియఁటే! యేదో యొక నిర్ణయమా సమయంబు తెల్పినన్
చేతులు నేను గట్టుకొని చేరన, యొట్టియ కాళ్లపై న్. 66

ఉ. కోకలుకోరదో, నగలుకోరదో, కానుకలేవి కోరదో,
పూకలుకోరదో, చెలియరో, తెలియంగను జేయకీవు న
న్నీకరణిన్ శ్రమంపఱచ దేమిటికే! ఫలిజన్ము నేపయిన్
లోకము తెల్లఁజూచి కృతిలోఁ గొనివచ్చెద నీవు కోరినన్. 67

మ. ఉవిదా, యక్కర తీసునంతపటి కేవో యుచ్చికల్ బుచ్చికల్
చవికిష్టంబునఁబల్కి, యా వెనుక నిఁ చేరంగ నేరానో యు
న్న విచారంబును బెట్టుకోవలదు, మేనం బ్రాణమున్నన్ని నా
ళ్ళు విధేయుండను నీకు, నావలపు నేండ్లుం బూండ్లు తగ్గించునే. 68

ఉ. మక్కరనీకు కద్దనిన మాత్రముచేత లాభమేమి నా
యక్కర దానఁదీఱునఁటే! యక్కఱ, పీనిదు ముద్దులబ్బెనో!
అక్కరనిన్నుఁ జేర్చుకొనుటబ్బెనో! నీమధురాధరోష్ఠమున్
నొక్కుట యబ్బెనో! మఱి మనోహరి, పట్టిప్రియం బిదేటికే. 69

ఉ. వారికి వీరికిం దెలియ వచ్చునటంచును జంకుచున్న, నో
నీరజనేత్ర, యెన్నఁటికి నీవియుఁ గార్యము సానుకూలమా

నే! రమణీజనంబులకు నిండుగ సాహసముండు నందు; తే
దారిఁజూపి, నాదుసరదా కొర దావడకుండఁ దీర్పుమా. 70

శా. పాతివ్రత్యము కల్గుదానివలెనే భాషించుచున్ నిష్ఠలున్
నీతుల్ పల్కిన, ముద్దరాల వనుచున్ విన్నంతు రే? యున్నదో
చేతుల్ చూచిన జాణవంచెఱుఁగనా! చెల్వా, యిదేరీతిగా
చాతుర్యంబులు చూప కేలుకొనవే సంప్రీతిచేతస్కవై. 71

చ. మగఁడు మనంబునందు ననుమానము పొందెను గాన నన్నురాఁ
దగదని వార్తపంపితివి, తప్పుకొనన్ మిషగాని, నిశ్చయం
బుగ మదిలోననీవు వలపుం గలదానవహోని, భర్తక
న్నుఁగవను కప్ప నేరవె మనోహరి, యింతటిజాణ వయ్యునున్, 72

శా. గోడల్ గొందులుదాటి, జంపముతో నొంటుగా లేక, కన్దోయి కె
వ్వాఁడింపై కనిపించినన్ సరియె యవ్వాని మదేచ్ఛను రతి
క్రీడం దేల్చిన ప్రౌఢవీవని ధరిత్రిన్ నీదువిఖ్యాతి వి
న్నాఁడను, నేఁడు ననున్ వరింతువని యున్నాఁడను పువుఁబోఁడిరో 73

ఉ. చెప్పెద నింటివారి కనిచీకటినన్ బెదిరించ దేల? యేఁ
తప్పుదుమోపి చెప్పెదవు? తావకహాసము చూడఁగూడదో
యొప్పుమటంచు వేఁడనగదో? యటుచెప్పదుగాని, ముందుగా
తిప్పలుపెట్ట కేలుముగదే జగదేక విలాసినీ ననున్. 74

చ. అతివరో. యింటఁదెల్పెదనటంచును నన్ బెదరింపఁబోక, నీ
వు తెలుప, నేనుమాన, తగవున్ వివువారలె తీర్పుగాక, యు
ట్లు తొలుత నాశపెట్టితివో, లోఁకువయైతి నటంచు నెట్లునా
హితమును దీర్ప మానితివో, యీసకలంబును బైకి చాటెదన్. 75

శా. పాపం బీవని యంచు నన్నిపుడు చేపట్టంగ రావేని? నీ
కే పాపంబయి, నాకు కాదె, నరలోకంబీవొందు, నేనొందుదుం
దాపం బచ్చటఁబొందఁగా వలయు నన్నం దావమిచ్చోట లే
కో పూఁబోఁడి భయంబు పోవిడిచి, నన్నేలంగదే సత్కృపన్. 76

ఉ. పాపమటంచు నన్నుఁబరిపాలనచేయు కొప్పవేల! తా
రావతి నేలినట్టి గురురామునకుఁగలగని పుట్టిపాపమున్
గోపకుమారు గోపికలు కూడఁగ గల్గనియట్టిపాప మో
సీ పువుఁబోఁడి నీకొకతెకే యుపలబ్బె నయబ్బురంబుగన్. 77

మ. అతివా, అంగననమ్మరా, దననీ పద్యాంబెన్నఁడో మున్ను చి
న్నతనంబందు పఠించినాఁడను, నన్నుఁ నమ్మించి నమ్మించి, యి
ట్లుతుదన్ నీకొనరించు మోసమిపుడు డాలోకించుచును, దానికన్
స్తుతి కా, దక్షరలక్షలీయఁదగునంచున్ నేడునే నెంచితిన్. 78

చ. నెలఁతరో, కన్నెప్రాయమున నీవు మదంకము నెక్కి, నీదుచం
కల గిలిగింతగొల్పుచుచు, కాయము నెల్లస్పృశించి బుగ్గ ము
ద్దులుగొనుచున్, ననున్ వలచితివో వగలాడి' యటన్న నవ్వి "నా
వలపుల కాంత"నంటి, వలవాక్యము నిక్కము సేయుమియ్యెడన్. 79

ఉ. ఈడుకునీవువచ్చునన, నింటనుగల్గినవారు నిన్నుఁగా
పాడుచు చేడియాఁ బయట పాదముపెట్టఁగ నీని వేళ, నిన్
చూడఁగ నేనుబద్ధశ్రమచూచితి వేనియు, నిప్పుడైన నా
వేడుక దీర్పకుండుదువె వేపుచు కాఁపుగ కూరుచుండినన్. 80

ఉ ఎన్నటికింక నీవదిగి యీడుకువచ్చునొయన్న వాంఛతో
కన్నులనీదు సొబ్బవ మొగాదిగిఁజూచుచు వత్సరంబులే
నెన్నుచునుండ, నిప్పటికినీవు రజస్వలవైతి, వింక నో
కన్నె యుపేక్షమాని వడిగా మదపేక్షను దీర్చిపోవుమా. 81

ఉ నుందరి, పెద్దదానవయి శోభిలుకాలమునందు నొంటిగా
నందు లభించినంత, కనుసైగలు, నవ్వులు, మేపరాపులున్
తొందరపాటుముద్దులును దొంగతనంబుగ మాన్పుకొన్న యా
చందము నీకొకించుకయు జ్ఞప్తియులేనటులుంటి వియ్యెడన్. 82

చ. ఇటునగలట్టిదారి మనమిద్దఱమొంటిగ తానసిల్లఁగా,
చిటునగనొప్ప నీభుజముచేనను జెచ్చెర ద్రోసికొంచు నీ

వరిగిఁ నాటిచందమును నందము డెందమునందు నాటుటన్
మఱవకయున్నవాడను సుమా కుసుమాంగి సుమాస్త్రనాగరా
ఉ. అంటెనొ నీకు నూత్నముగ నచ్చట నేదియొ! భాగ్యమత్తవా
రింటికిఁ బోయి వచ్చిన యిటీవల బాల్యపు నేస్తకాని న్
కంటను జూడనైతివి, ముఖాముఖమైన, మొగంబు వాల్చికొం
చుంటివి, బాల్యకాలపుఁబ్రియుల్ కనిపింతురె భర్తవచ్చినన్. 84
చ. పొరుగున కీవు వచ్చుటను బుణ్యమువండెను నాకటంచు సం
బరపడుచుండ నన్నుఁగన కైకొనిరా, నొక వేళ వచ్చి న
శిరమును వ్రాల్చి, వత్తినను, జేసిన సైఁగకు మారుచేయ, వీ
విరుగునఁ జేరినట్టిఫలమే కనిపింపక యున్నదో చెలీ 85
సీ. బొట్టు పెట్టమి మచ్చ కట్టకుండఁగఁ దేట
యైౖ ముచ్చటం గొల్పు మోముతోడ
పగలు క్రిందను మీఁద దిగవేతుకొనమి వ
ల్పొందక జిగి గల్గు నొడలితోడ
నూనె వాడుకను మానుటఁజేసి జిడ్డును
బొరయకయున్న పెన్నెఱులతోడ
రవికలేమిఁ దెలిచీరను స్పష్టమౌ వటు
కనిపించు మేని పొంకంబుతోడ
గీ. తరుణీ, యిప్పటి బాలవితంతురూప
మే! వెనుకకంటె నెక్కువ హితముఁగొల్పె
భర్తకంటెను నీకు వభర్తనొచు
నెక్కువహితంబు కూర్చు నే నింకమీఁద, 86
ఉ. విధవాత్వంబున కీవు చింతిలకుమీ వీరేశలింగంబుగా
రు ధరన్మీకొఱకేజనించి రలవారున్ దారిచూపింపకు
న్న, ధృతిన్ మానఁగబోకు, నీకుదయ యున్నంజాలునో బాలికా
వృధగా నీవొల్లపాయుముం గడవఁగానీయంజుమీ యెన్నడున్ 87

ఉ. బొట్టును బెట్టుకోఁ దగిన పుణ్యము పోయెనటంచుఁ గుందకే,
ఇట్టులు లేఁత ప్రాయమున స్వేచ్ఛ లభించుట భాగ్యమే గదా!
ఎట్టివిధంబులోప ముదయింపసి యుల్లగ, నీకు బొట్టునుం
బెట్టి ప్రియంబునం బిలుఁతు ప్రేయసి, రాఁగదె నాదు ప్రక్కకున్.

సీ. ముంగురుల్ నొసటిపై ముసరిరేం పెసలారఁ
గను నీవు నాట్య మాడిన తెఱంగు
వీనులఁ దేనెల సోనలఁ గురిపించు
చను నీవు పాట పాడిన తెఱంగు
కరకంకణముల నిక్వాణ మనుక్షణము గ
ల్లనఁగ నీవభినయించిన పోరంగు
తూపుల రూపున చూపలు హృదయముల్
కలిగించు నీదు చూపుల మెఱుంగు

గీ. మేళముల తోడి వారకామినులతోడఁ
గూడి నీవున్న యట్టి యందును గనుంగొ
నంగనే యనంగుఁ డేచఁ గడంగె; నంగ
నామణీ నీమఱుంగు నొందంగ నిమ్ము

శా. కోకోక్తంబును నేర్చి, వాక్కులును టక్కుల్ పెక్కుగా నేర్చి వే
ఔక్రైవ్యతె నీకు సాటియగు నోహో! వేశ్యలందేనియున్
రొక్కం బెంతయు నర్ల సరే యొసగెదన్ రో చేడెనో, నన్నికన్
చొక్కింపంగదె, నేర్పులెన్నికలవో చూపించుచున్ మిక్కువన్. 9

ఉ. కాంతలె మాయకత్తె లనఁగా వెలకాంతయు మాయకత్తె లం 10
చింతురో, వేత చెప్పసలెనే! యిది స్పష్టముగా నెఱింయున్,
స్వాంతము నందు నిన్ వలచి వచ్చితి, తక్కిన వేశ్యలట్లె కా
వింతువొ, నమ్మకంబు నొదవింతువొ యీపయిఁ జూడగా వలెన్.

మ. మగవారల్ వశమౌట కెల్ల గణికల్ మందుల్ ప్రయోగింతురం
టి! గుణంబిచ్చ్వనటంచు నాకెవిరొ పెట్టంబోదు వేమోనుమీ;

వగలాఁడియటు పెట్టుకున్నపుడె యోర్వఁగరాని యీగాలిఁ
డేఁగదా! పెట్టిన, మన్మథుండసువులేనిన్ విల్వంగాఁ జచ్చునే! 92

సీ. చవిచూపితివె నాకాని దాన, నీయధరసు
ధల్ పల్మాఱులుఁగ్రుచ్చి త్రావనైతి,
అలంచితివె నాకాని యతివ, చెక్కుటమోవి
నమకొన్నరీతి ముద్దాడనైతి
స్పృశియించితివె నాకాని చెలి, నీయురోజముల్
గట్టిగా పలుమారు పట్టనైతి,
తలంచితివె నాకాని తరుణి, మేనుమేను న
ల్లికగొనంగాఁ గౌఁగిలింపనైతి,
గీ. మచ్చుచూచితివె నాకాని మగువ, ప్రథమ
నిధువనంబౌటఁ దృప్తిజనింపఁగా ర
మింపనైతిని, గాననేయింపుమై వు
నస్సమాగమనంబునకు నింతగఁ దపింతు. 93

ఉ. కౌఁగిట నిన్నుఁ జేర్చుకొనఁ గల్గెడిభోగము నింద్రభోగముం
గా గణుతింతు, నెంతనినుఁ గౌఁగిటఁజేర్చినఁ దృప్తికల్గలే
దో గజరాజయానా! యుఁకనొక్కపరిన్, మఱియొక్కమాఱు, త
ద్భోగము నేనుబొందెదలఁతున్ వినువుంగన కెల్లొసంగుమా 94

ఉ. కాముకవృత్తిమై రకరకంబుల భామలతోడ నేస్తమో
కామిని మున్నసల్పితివిగాని, యెకర్తుకతోని నేర్పునన్,
గోముగ, నిన్నుబోలఁగలకోమలి కన్పడలేదు, నేనిఁక
కామునిసాక్షిగాఁగ నినుఁగాక మఱొక్కతె నొల్లనెన్నఁడున్. 95

ఉ, ఓ ఫణిరాజవేణి, మనమొండొరుమోములు చూచుకొన్న వే
ళాఫలమో, మఱేమియో, బళా! నినుఁ గన్నులఁగన్నదాదిగా
సాపుగ నన్యకామినుల సంగతికిన్ మనసొగ్గదాయె, ద్వై
రేఫము వేఱుపువ్వులఁ జరించునె, నీరజమే లభించినన్. 96

చ. ఈ బదరీఫలస్తని సరసంబునకుం బొలయల్కయుండఁగా
వలయునటంచు వల్గితివో! వ్యగ్రపుఁగోపము తెచ్చుకొంచు, నీ
పులకితపల్లవ కీరవాణి యూరకయుండుటనీతికాదు, నన్
పిలిచి, యథాప్రకారముగఁ బ్రేమను గౌఁగిటఁ జేర్చుకొంగదే 97

ఉ. ఇంకొకకామినిన్ మరగి యిప్పుడుపోవుచునుంటినటంచు నో
పంకజనేత్రి! యిట్టియపవాదమునాపయి మోపెదేల? యి
ట్టింకులుగొన్న మోహముననివ్విధిగా, దీక నెప్పుడున్ భవత్
కింకరుఁడన్, మఱింకఁ దొలఁగించుకొనంగదె నీదుశంకలన్. 98

శా. ఏమాటంకములెన్ని కల్గినను నిన్నే నేను, నన్నీవు కాం
తా! యిన్నాళ్ళును నాశ్రయించుకొని యున్నాం, మింతో
యుంకో సుఖం
బే యెల్లప్పుడుఁ బొందనారముగదా! యిట్లున్న యన్నాళ్ళనున్
హాయింగూర్పఁగ నిన్నవేఁడుకొనెదన్. దైవంబు,
ప్రార్థించెదన్, 99

సీ. మంగళం బగుఁగాక మానినీ తారకా
సభములో తావకసభములకును !
మంగళంబగుఁగాక మగువ, చక్రవర్తి
బింబమౌ నీదునితంబునకు !
మంగళంబగుఁగాక మహిళామణీ, కోక
రాజములౌ నీయుకోజములకు
మంగళంబగుఁగాక మదిరాక్షి. శశికళా
సదనమౌ భవదీయ వదనమునకు !

గీ. మధువుక్రోవియౌ మోవికి మంగళంబు
మల్లెపువ్వులగు నవ్వులకు మంగళంబు !
మనులు గనులగు కనులకు మంగళంబు !
మధుకరులగు ముంగురులకు మంగళంబు !

ప్రథమ భాగము సంపూర్ణము.

—0—

★ జాబులు ★

రెండవ భాగము


నందన సముఁడందకాఁ
డైన మనోహరునకుఁ బ్రియురా లనురాగం
బూని కవుంగిట గాఢము
గా నణఁచుచు బ్రేమోక్తి, చేయఁగల విన్నపముల్.

ఉ. కంటికి నింపుగాఁగ నినుఁ గన్నది యాదిగ కామబాధచేఁ
గంటసమయ్యె నాబ్రతుకు, కంటికి నిద్దుర రాకయుండె, ఆ
కంటికి వన్నెమైనఁ దినఁగా వెగటయ్యెను, నిన్నుఁగానమిన్
గంట యుగంబు కైవడిని కన్పడుచున్నది ప్రాణనాయకా. 2

చ. అల దినమందు నా సమయమం, దల, చోటున, నీటుగోటు, లిం
పులు పలు సొంపు, లందమును బొల్పగు చందము, షోకురీతు. లే
పులుబలుకోపులుంగల యపూర్వపు నీ చెలువంబుచూఁచి, నా
తలఁలు నీవయిన్ నిలిచె, తపవరో! యెటు త్రిప్పఁగొన్ననున్.

సీ. లేఁతవెన్నెలను బోలిన చిఱునవ్వుతో
మురియుచున్న నీ ముద్దుమొగము
కర్ణరంధ్రములద్దుగా రాఁగ నిల్చిన
గతిఁ బొల్చుచున్న నీకన్నుదోయి,

విలరాజు పూర్తిగా వంచిన విండ్లనై
ఖరిఁ జెలువారు నీ కన్నుబొమలు
మోవి తేనియ మీఁద ముసురు తుమ్మెదలట్లు
మిసమిసలాడు నీ మీసములను
గీ. నీవెడఁదఱొమ్ము మఱియు నీనిడుదభుజయు
గమ్మ నీనడల్ నీతొడల్ గాంచి మది
రించి, తపియించుచుంటి నో ప్రియుఁడ యెట్టి
గతిగఁ బ్రోతువో! యిఁక నాదుగతివి నీవె. 4

ఉ. చక్కదనంబునన్ సరిగ సంపెఁగ మొగ్గయు, తమ్మిపువ్వు, నీ
ముక్కు, మొగంబు వానిఁగని మోహముఁ బొందితి,నాదుప్రాణముల్
దక్కకయుండ, సంపెగలుఁ దామరలున్ మదనుండు నాపయిం
గ్రక్కున వేయసాగె, ననుఁ గావుము నీమరుగిచ్చి నాయకా.

ఉ. సంపెగమొగ్గలో తగవుసల్పెడిముక్కును, మల్లెమొగ్గలన్
చెంపలగొట్టు పల్వరుస, సింగములన్ బెదరించు మధ్యమున్
కెంపును నీరసంబనుచు గేలియొనర్చెడి మోవిదగ్గ, నీ
వింపుఘటింతువోయి హృదయేశ్వర, నాకనుదోయి కిప్పుడున్. 6

ఉ. తుమ్మెదతెక్కఁబోడ తులఁతూఁగఁగజాలెడు నీదుమీసమున్,
తమ్ముల నేను నీకనులు, తల్పుమువోలె వెడందమైన నీ
రొమ్మునుగాంచి, మోహము నెఱుంగని నామది యిప్పుడక్కటా
కమ్మరిసారెలోపల తగుల్కొనునట్లుగ నాయె నాయకా. 7

ఉ. నాపెనుమోహమంతయుఁ గనంబడునట్లుగ మాటిమాటికిం
జూపులఁ దెల్పుచుంటి, ననుఁజూచుచు నవ్వుచునుంటి వీవునన్
నాపయికూర్మిపుట్టి యటునవ్వితివో, యటుగాక నాదు సం
తాపముగాంచి హేలనని నవ్వితివో, యెఱుఁగన్ మనోహరా. 8

చ. కరిగను, మోడిగాఁగ, సరసంబుగఁ గేలిగాఁగ, నోరగా
చుఱుకుగ. నన్నుఁ జాతుఃవల చూపులభావను నేనెఱుంగ, వల్
తెలుపక, యించుకే తెలిసి లేఁతగ పూర్ణముగాఁగవిప్పి సుం
దరముగ నవ్వు చుంచు, వలనవ్వులభావము నాకునేర్పరా. 9

శా. నీవెవ్వఁడవు, నేనెవర్తె? సహాహా! నీమీఁదనీమోద్కా నా
భావంబేటికినిల్వ, కల్పవిరికిన్ పద్మాక్షి పైరీతి? యీ
పూవుంబోఁగిక దూరపుంజెలిమితో పొందక నాకబ్బునో?
నీవున్ నేనును బూవుఁదావియుబలెన్ నెయ్యంబుమైనుందుమో. 10

చ. ఒకరికిమెచ్చుగొల్పుసొగ, సొక్కరికంటికి నచ్చదోయి నా
యక భవదీయరూపము మదక్షులకుంబ్రియమైనయట్టి పో
లికగనె, నాదురూపమున లేని విలాసములేని నీదుకం
టికిఁగనిపించుత, స్మరుఁడు నేర్పుమెయిన్ ఘటియించుమాయచే! 11

ఉ. ఒక్కొకకాంత కొక్కొకప్రియుంగనునంతకు లోకమంతయున్
నిక్కముగానడాచివలెనే కనుపట్టును, కన్నదాదియున్
చక్కని నందనోపవని చందముసంగనుపట్టు, నీవునా
దృక్కులపడ్డయంతటనె, దిక్కులు పుష్పమయంబు లయ్యెరా 12

ఉ. ఓరమణుండ, స్త్రీపురుషులొండొరులన్ సమవాంఛ నేలఁగాఁ
బో "రదిజన్మవాసనయెపో" యని పెద్దలుపల్కలేదె! తా
గోరిన పూరుషుండు తనుఁగోరుటకింతెను భాగ్యమున్నె? నిన్
గోరితి, నీవునాకు ననుకూలుఁడఁవౌదువో, లేదో, యక్కటా! 13

చ. వలపెదలేనియట్టి మగవానివయిన్ మనసుంచి, వానితోఁ
గలయుఁగ గోరుకంటె నరకంబిక స్త్రీలకు వేఱెకల్గునే!
తెలియకనీపయిన్ నిలిపితిన్ మది, నీవేమి నీదుచిత్తమో
తెలుపఁడ నాదుభాగ్యమిదె చేతులుమోడ్చితి యేలుమానసున్.14

మ. వలపుం దాఁతురు గాని, పూరుషులతో వాయెత్తి స్పష్టంబుగం
దెలుపంజాలరు స్త్రీలు, నాదువలపున్ నేనాపుకోలేక, ల
జ్జలఖండన్ వెలిఁ బెట్టుకొంటి ననుచున్ సిగ్గయ్యె, నెమ్మోమునిం
కిలలోఁ జూపఁగలేను, దాఁచుకొనిమ్మా నాథ నీగుండెపైం.

ఉ. కన్యనొ యన్యకామినినొ కావలెనంచుఁ దలంపఁబోక, సా
మాన్యగ నెంచి ప్రావకము మాటతలంపుము నిన్నుఁ దక్క-నే
నన్యుల కంటనైన నరయన్ రతివేళన వేశ్య నౌచు నిన్
ధన్యునిగా నొనర్తుఁ, గులనారు లెరుంగని యట్టినేర్పుతో. 16

మ. నినుఁజూడన్ వలెనంచు, నీలయినచో నీతోడ సంభాషణం
బు నొనర్పన్ వలెనంచు, వాకిటనె తేపున్మాపు నేఁ గాఁపురం
బొనరింపందొరకొంటి, మోహముననో హా! సాహసం బెక్కు-వా
యెను: నే నే చనుదెంచి, పైఁ బడదలమిమ్మా నీవురాకుండినన్.

ఉ. నిన్నుఁగనంగ, నామనసు నిక్క-ముగా సెగపొంత వెన్నయౌ,
"వెన్నవలెం గరంగు నలవేణుల కౌఁగిటఁ జేర్చుటే సుఖం,"
బన్న వరూధినీ వచన మారసి, నన్ వరియింపు, మిట్లుగా
కున్నను, నామన స్సుమశుకో వవమున్మధ, మన్మథాగ్నిచే. 18

మ. మృగరాజా, బిగువేల! బ్రహ్మభవదాత్మం జేసెనా హేమకా
యిగ! నేనే మృగవాడనై, మఱియు నీవేకాంతవై, నావజుగ్
మింగులన్ మోహముచేతఁ గ్రాఁగుచును నీమే నున్నచో.నూరకే
వగిదిగా బెట్టొనరించి నీయుమరులన్ బాలాటకుం జూతునే.

ఉ. నమ్మక మైనదాన ప్రియనాయక, నాహృదయంబు నీకు నే
నమ్మెద రమ్ము నీదయకు, నయ్యది చాల ప్రియంబటంచు జే
రమ్మును బెట్టి నీవు కొనరం జూడఁగ [illegible] ముకం
గమ్మ నొసంగదా వదలఁగా వల దింకటి [illegible]

చ. అవసరముండి నేఁబిలుచుమన్నను బల్కవు పంచదార చి
ల్క వంటర! నిశ్చయం బగు శుకంబుగ నాభుజపంజరంబునన్
వివిధవినోదవాక్యలను వీనులవిందుగఁ బల్కుచున్ వసిం
తువనిన, నీకు నాపెదవిదొండనుతిండిగఁ బెట్టెదం బ్రియా.

చ. వనిత దనంతఁ దా వలసివచ్చినఁ జుల్కనయంచు. నన్నుఁ జు
ల్కనగను జూడఁబోకుమురా, కాదని చుల్కగఁ జూడ నెంచుకో
న్నను, పురుషాయితంబులను నామెయిభారముగాఁగనుండఁ బో
దని యయినన్ ననుం గలయరా వలరాయనికేళి నాయకా.

చ. మగఁడన కింటికింపగుచు మక్కువగొల్పు నతండెయంచు ము
న్నగవును దెల్పెఁదార, యలతారకఁ జంద్రుఁడు కోలె నీవు నా
మగఁడవు తాఁడులేని యనుమానము తీఱఁగ, బాహుపాశమున్
బిగువుగ నాగళంబునను బ్రేమను గట్టఁగదోయి నాయకా.

సీ. ముద్దాడెదను రార మోహనాకార నన్
ముద్దాడ నీకు మోమాటమైన,
పెదవి నొక్కెదరార ప్రియనాయకా నాదు
పెదవి నొక్కుట నీకు బిడియమైన,
కౌఁగిలించెదరార కామినీమార నన్
కౌఁగిలించుట నీకు కష్టమైన,
సరస మాడెద రార సరసుఁడా, నాతోడ
సరసమాడుట నీకు శంకయైన,

గీ. కటకటా! నోటవేలిడ్ పెట్ట కఱవలేని
కరణి నున్నావుగాని, యొందఱి పెదవుల
గఱచినట్టి భుజంగశిఖామణి వౌరా!
ఎట్టిపుట్టలో, నేపాము యెవరికెఱుక

శా. నీసౌందర్యము గాంచి యాశ పడితిన్ నీ చిత్తమేతీరో నీ
మీసం బట్లువ్రిసన్నదై తవరు నో! యారీతిగాఁ గాక, నీ
మీసం బట్టులః పక్రిమో యెఱుఁగ; నీమీసాలలో నవ్వులన్
నా సందేహము వృద్ధిచేసె; నది మాన్పం జిత్తమిమ్మా ప్రియా,

ఉ. నాయక, నీవు నన్ వలచినాఁడ వటంచును నాకుఁ దెల్పఁగా
నే, యొడలెల్ల జల్లుమనియెన్, వలిగాలికి తీవకై వడిన్;
కాయము దాల్చినందులకుఁ గల్గె నదృష్టము నేటికిఁ గింక నా
ప్రాయము ధన్యమయ్యె; నిటుపై మఱి యే దెటు లైననున్ సరే

ఉ. ఎన్నఁడు నీకు మోహముదయించునో నావయినంచు నుండగా
ఇన్నిదినాల కద్ది లభియించెను కాంతల ప్రాయమున్ననో
క్రొన్ననవంటి దోయి 'యిదిగో' యన నాటునెలల్ గతింప కుం
డ, న్నను ధన్యరాలిఁగ నొనర్పఁగ రాఁగదవోయి నాయకా,

ఉ. కోకలు గోర, రూకలును గోరను, సొమ్ముల బెట్టఁగోర, నే
కోకముగోర నీకరుణ సోకుటయే పదివేలు నాకు, నీ
రాకనె కోరుచుండెదను రాకను జెందావ గోరుమాడ్కి న
క్రొకలు నన్ను బెట్టకుమురా. కలకాలము నేలరా కృపన్. 28

చ. తనప్రియుఁ గూడకుండ వసుధం గులకాంతకు వర్తియంచు. మా
ముని, మఱియాడుబిడ్డలని యడ్డులు గంగకు నొడ్డులట్లుగా
కని కనినాదు కాఁపురము గంగను దింప తెగింపు పుట్టెను, గం
గను శివుఁ డేలుకొన్నటులుగా నను నేలెద వన్నచో ప్రియా.

చ. పురుషవరేణ్య! స్వాతికయి ముత్తెపుఁ జిప్పలరీతి నాకనుల్
త్వరపడుచుండ తావకవిలాపము కన్గొన స్వాతిబిందువుల్.
కురిసినగాని ముత్తియపు కోవ జనింపదు శుక్తులందు ని
న్నరయనికాలమందె యుదయంబగు నాకనులయందు ముత్యముల్

మ. నిదురన్నామ్రని మెఱుంగగా నలికిలిన్ నీవచ్చు ద్వారుల్ పదిం
బది నా కాలుకకన్నులం బఱపి, రమ్మా, నాకు కన్పండుగా,
ఎదురుం జూచుచు నుంటి 'ఇల్లలుకఁగానే పండుగా!' యంచు నన్
వ్వేదవేమో! రొుకయిల్లెగా, కలికిరిన్ పీథిన్, మఱిన్వాడయున్.

ఉ. మందులు మంత్రముల్, వలెన మా మకచిత్తము మెత్తఁజేయ నీ
సుందరమందహాసములె చొక్కఁగఁ జేసెడి మందులౌ, భవ
చ్ఛందసశీతలోక్తులె ముదం బిడు మంత్రము కానఁ డెందమా
నందముఁ బొంద నా కలిపి నవ్వుచు కేరుచు నుండరా ప్రియా.

చ. రమణుఁడ. నాదు మానస సరస్సుదరిన్ వలరాజు నీదు మీ
స మనెడి ములిగాలపుకొసన్ నును మోవి యెరం దగిల్చి నే
ర్పు మెఱుని వేటలాడఁగను. మోసమెఱుంగని దైదె మదాత్మమ
త్స్యమకట! యందఁ జిక్కువడి యట్టిటు కొట్టుకొనంగఁ జొచ్చెరా

శా. నాకున్ నీకున్ గొంత యున్నదని నానారీతులం జేసులన్
లోకుల్ పెట్టిరి, కాదు రాఁదగిన దెట్లైన వచ్చె, హో దెన్నఁడున్
కాకుల్ లోకులనంగఁబోకు, జనవాక్యంబద్ది కర్తవ్యమే,
కైకొమ్మా ప్రియకాంత గాఁగ నను నేకాంతంబునం గాంతుఁడా.

ఉ. రోసము కల్గినట్టు లతిరూక్షముగాఁ గను నన్నుఁ జూచుచున్
మీసము త్రిప్పె దేమిటికి! మేటిమగండవె ధైన జంకు శే
కో సుకుమార, రమ్ము తనుయుద్ధము నందు పెనంగి చూత, మా
రోసమటంచు ముందెవర మందుమొ వారలె రొూడినట్లగున్.

ఉ. వ్యాకులమేల! వల్లభ, పరాంగనఁగూడినఁ బావమంచు కా
టాకులలోన వ్రాసిరనియా! యల వ్రాతలెటున్న, సేమిరా
నీకును నాకు బ్రహ్మముకు నిక్కముగాఁగను వ్రాసియుంచె, నే
పోకలఁ బో యినన్ జరుగఁ బోదుడ కారనిబ్రాఁత రీతిగన్.

ఉ. వాసవమూడ ఇట్టి ప్రవాసంబు నటంచును గొప్పలేల! వి
న్నాణ్, సరసాళులౌ వలపునం దనియించిన దాన; పీపురున్
వానికి నిన్ని పూవులనొ వ్రాలిన తేటిని యూటచేత, ఏ
దీ; సరసుండ, నా పెదవి తేనియచుల్ చవి తూచి చెప్పవూ.

మ. అనురాగం బిడనీకు నావయిని శీ దన్నట్టి లోపంపు మా
టను బల్కంగను బోకు; కుంకుమతోడం గూడి వాసించు చం
దనపుం బూతల నొత్తునైన యురము దాకించిన నిన్ కౌగిలిం
తును ప్రాణేశ్వర, దాన నీ హృదయమందున్ రక్తి కల్గుంజుమీ.

శా. ఆకాంక్షన్ నిను నేఁ గదుర్ తలచి నిద్రాహారముల్ మానుటం
జేసూరెన్ శివరాత్రి జాగరణనం సేవాఫలంబున్, విశు
ద్ధైకాదశుపవాసపుణ్యఫలముం; బ్రాణేశ, కైలాసమున్
వైకుంఠంబును గాఁగ నీ కవుఁగిలిన్ వాంఛించి నేఁ గాంచదన్

చ. ముడుపులు గట్టుకొంటె, మతి మ్రొక్కులుఁ మ్రొక్కితి, దేవుఁ డవ్వఁ డొ
క్కఁడుఁ గనఁబడ్డ నీ సులిమి కల్గఁగఁ గోరి: లభింపదాయె నా
ముడుపులు నీవకై కొనుము, మ్రొక్కులుఁ గైకొను, మీవె నాదు దే
వుఁడవు, దయాస్వభావుడవు ప్రోవుము వన్నెక విటేశ్వరా.

చ. ఇలవయి నాఁడు దాచు కవియింపఁగరాదు, జనించె నేనియున్
వలపును బొందఁగూడ, దనవా, కలపొందిన, లోనఁ గ్రుళ్లఁగా
నలయునె కాని దాని మగవానికి జూపఁగరాదు; చూపినన్,
చెలువకు రోఁత యై బ్రదుకు ఛీ యనిపించుఁ గదా మనోహరా.

చ. వదనము నైనఁ జూప; విదివాదఁటరా! "యిటురార" యన్న నీ
"వదెయిదో" యనందు; విధ్దిమరియాదటరా! స్ఫుటరాగమూరుదన్
కదియవు: భార్యకో గిటన కైదటరో! కట! రాతిగుండె దా
ల్చెదవు; [illegible]యసంగమము చేఁదటరా! విటరాజశేఖరా. 42

సీ. కంటిని కన్నులఁ గలపు కేళిఁగ. సుమ
శరు ధిక్కరించు నీ చక్కఁదనము
వింటిని రతిశాస్త్ర వివిధరహస్యంబు
లెఱింగిన నెఱజాణ వీవ యనుచు
అంటిని "కరుణామయా, నీకు నే దక్కి-
తిని, నీవె నాకిక దిక్కు"టంచు
ఉంటిని, "నీకృప యొకనాడు గాకున్న,
నొకనాఁటికైన నాకొదవు" ననుచు,
గీ. వింటిని శరాళిసంధించి విషమబాణు
డొంటిని జుఱుక్కనం గొట్టుచుండె, వాలు
గంటి, నిదే కేలుమోడ్చి నేగతుల వేఁడు
కొంటిని, గవుంగిటంగవ్వుకోడెగాఁడ.

ఆ. వె. నిన్నుఁ గన్న మొదలు నిముసమున్ మగనితో
ఱంకుతన మొనర్ప జంకుపుట్టె
నన్నుఁ జెట్టపట్టి నాదుపాతివ్రత్య
విధిని నిలుపు మయ్యవిటవరేణ్య 44

ఉ. హేయపుమాట లన్యులన నీ, కులబంధువు లెల్లకున్ వెలిఁ
వేయఁగనీ, చెలుల్ విడువనీ, పతి మున్నగువార లల్లరుల్
చేయఁగనీ, భయంపడను. చిత్తము నీకయి దాఁచియుంచినా
నోయిమగండ, వేరు మనముందము రమ్ము యథేచ్ఛగానిఁకన్.

ఉ. సామి, యిదేమిపాప! యొక జాబునకైన జవాబు వ్రాయ వే
మీ! మృదులాంగుళంబులకు మిక్కిలి కష్టమటంచు వ్రాయ లే
దేమొ! యిదొక్కకష్టమని యింతభయంపడుచున్న నాయుర
స్సీమను జందనద్రవము చిక్కఁగ రాయుట కేమి యందువో!

ఉ. చిత్తజరూప నీవు కృపనుతను నాకిపుడంపినట్టి నీ
యుత్తరమందినంతనె, ప్రియున్నినుఁగన్నటులాయె, జన్మమే
నెత్తుట రిత్తపోక, ఫలియించిన యట్లునాయె, నేలపై
హత్తక మిన్నుముట్టినటు లాయెను, చింతలన్నియున్.

తే. గీ. అక్షరము లమృతకణంబులౌచు మాట
లమృతపుందేట్లౌచు, వాక్యంబు లమృత
ధారలౌచు, నా జీవనాధారమయ్యొ
నీవు వ్రాసిపంపినచీటి నీటుకాద.

ఉ. కంటిని నీదుజాబు వగకాడ, కనుంగవ కద్దుకొంటి, జె
క్కిటను జేర్చుకొంటి, పలుక్రేవల ముద్దిడుకొంటి, మానసం
బంటగ నొత్తుకొంటి, శిరమందిడుకొంటిని, దుంటవింటివాఁ
డింటను బంటుగాఁగనిక నేలగ నుంటిని నేఁటినుండియున్.

ఉ. సామిగ, నన్నురమ్మనుచు జాబును బంపితి, వట్లుసేయ, న
మ్మో! మరియింకనేమయిన నున్నదె? యొందటుకైన నేను కన్
బ్రాముదు? నారహస్యమును పైఁబడకుండగ నీవుదాచదో
యేమనియుంట గోర్కెగల దేని దలంపకుమిట్టి కోరికల్.

ఉ. వింటివా, లేదా? పైకడుగువెట్టగఁగూడని క్రొత్తకోడలన్
వెంటనె నీదు కోరికను వీలొదవించుట కెట్లునేర్తు? పు
ట్టింటికి పోవు నంతవరకించుక యోపికపట్టితేన, నా
నంటిది యాటకత్తెల భ్రువంబుగ లేదనిపింతు కాంతుఁడా. 51

ఉ. చాలును జాలు పూరుషుల సంగతి, యే సతులేని మీవయిన్
జేలతనంబునన్ మనసు పెట్టిన, వారల గుట్టు వీధిలో
నాలవనాటి యుండుగద! నానదునోటను మావుగింజయున్
బాలిక, మీక, గోలనగు బాలను గానుర గోతిలో బడన్. 52

చ. నరసుఁడవయ్యు వన్నె వెతసల్పఁగఁ జెల్లునె! చిన్నదాన నే
మెఱుఁగను సిగ్గుదీఱు, కని యెన్నివిధంబుల పాటపాడినన్,
మఱిమఱి ముట్టసెం చెదవు మానుక చిత్తము నీదుమాటలం
గరఁగునొ! నీదుపుణ్యమగుఁ గాని, నరుగ విడుమయ్య జాబిఁడా

చ. ఎవరిఁక నిన్ను నమ్మఁగల! రింటికి నింటికి ముగ్గుపెట్టినా
వవసర మంతయుం గడచి నంతటనే నుడిపెట్టినాఁడ; వె
ల్లవిభులు నూతనప్రియులు లీలాస్థలి న స్నటులే చరించు చుం
టి నవుర! నీదు చెల్మికిని నీకును దండము జారశేఖరా. 54

మ. ఒకరా, యిద్దఱ, ముగ్గురా, మొదట నెంతో నీవునమ్మించి గొం
తుకలంగోసిన యాఁడువారు! వమలున్ మాస్లుంగదా! వారు బా
లక, నన్గోలిని ద్రోయ నెంచితివొ! చెలంగాను, నా మోహ మా
పుకొనం జాతునుగాని, యెన్నఁడును నీపొత్తొల్ల జారాగ్రణీ

శా. నీపైనే తమయాశలెల్లగల కన్నెల్ వేనవేల్ ప్రియా!
ఆపై నేనిఁక నేల! యీచెలిమి కేనడ్డంబుగా వచ్చినన్,
పాపంబబ్బుతు, వారలన్ వదలి, నాపైనేతమిన్ నిల్పి, న
న్నే పాలింపుమనంగ న్యాయమగునా! నీవైనఁ బాలింతువా!

చ. విభుఁడ ననున్ వరించుమనుచు విన్మకసంగతి, యిప్పుడున్నయీ
రభసము తగ్గినంతట నె రాకెదపెట్టితివేని, న్యాయపుం
సభలకు నెక్కునేదగవు సల్పకమానను నిశ్చయంబుగా,
ఉభయుల ప్రతిష్ఠ వడకుండెడు మార్గము చూడుమిప్పుడే.

శా. న్యాయంబైన తెలుంగు నేఁ దెలిపెదన్, నాకీవు నీమానసం
బిత్తున్ వచ్చెదు, మానవచ్చు నది నీయిష్టంబె యో, గాని వి
న్నామ, యాదిన్ మనసిచ్చి, యా వెనుక మానంబోవ, నేనొప్పనో
వోయీనాయక, తక్కుగా మొదటనే యూహించి నన్ గోరుమా.

చ. పరవశమయ్యె నాయొడలు, భాగ్యవశంబున నిన్ని నాళ్ళకున్
దొరకిన నీదుపొందున. మనోహర యయ్యెడనొత్తుకొని మేల్
పరుపున మెత్తనౌవిరుల పై నవరుంటిమొ, చావమీద ని
ర్వ్యర మెడమీఁది గుత్తపుగవంగిట నుంటిమొ నేనెరుంగరా.
చ ఒడలిని చేతితో నిమిరి, యొయ్యన జెక్కులు ముద్దులాడి, నీ
తొడఁ బసింపఁ జేసి, తమితోఁ బ్రియవాక్కుల బుజ్జగించి, నా
జడుపుడుగంగఁ జేసి రతిశాస్త్రము నేర్పిన యొజ్జవౌట నీ
కడఁకువతో నొసంగితి బ్రియా గురుదక్షిణగాఁగ గౌగిలిన్.
ఉ. నీదుకవుంగిలింతలును నీ గిలిగింతలు, నీదు వేసమున్
నీ దరహాసముల్, వగల నేర్పులు దీర్పులు, నీ సయాటలున్
నీ వయగల్లు మాటలును, నీమురిపెంపులు బుజ్జగింపులున్
నేఁ దలపోయుచున్ మఱవనేరమురా ప్రియ, నీదుకూటమిన్.
సీ. కను విప్పి నను నీవు కనుఁగొనం దెలికల్వ
విరులు జల్లునరాలు కరణిఁదోఁచు
మోవి విప్పి యొకింత నీవు నవ్వఁగ బండు
వెన్నెలన్ మునిఁగిన విధము తోఁచు,
పలువిప్పి తీయు పల్కులు నీవు పల్కిన
అమృతధారం రోగినట్లు తోఁచు,
కేల్గవ విప్పి కౌఁగిట నీవు నను జేర్ప
స్వర్గంబు నందున్న సరణిఁ దోఁచు,
ఆ. వె. మనసువిప్పి నీవు మన్నింప, నాదు జ
న్మంబు ధన్యమైన మాడ్కిఁ దోఁచు
నీదు పొందు కంటె పైదలుంటు లేదు,
లేదు, లేదుభాగ్యమో వయిసుడ.
సీ. నీ పల్కులను విన్న నిమిసమందే నాకు
జల్లునఁ గన్నీరు చిమ్ము చుండు,

నీ కేలుతాకిన నిముసమందే, తను
వెల్లను నాకు జల్లుమనును
నీవు ముద్దాడిన నిముషంబునందె, చె
క్కులు మిక్కిలిగ నాకుఁ బులకరించు,
నీకౌఁగిలిం గన్న నిముషమ్మునందె, డెం
దమ్ము దట్టమ్ముగా జెమ్మగిల్లు,
ఆ. వె. నిన్నుఁ గూడి నపుడె నెమ్మేను కంపించు
చేఁత లుడుగు గనులు మూతవడును,
హృదయ మదరఁ దొడగునది సుఖమో, కష్ట
మో, యెఱుంగజాల నోయి సామి. 63

సీ. పలుమారు నిన్ను ముద్దులుగొంటి, నీవు చె
క్కిళ్ళు కందు నటంచు శంకింపకుండ,
ప్రియమారగా నీదు పెదవి నొక్కితిఁ, బ
ల్మిన నాటునంచు పొరపాటపడక.
గాఢంబుగా నిన్నుఁ గౌఁగలించితిని, నీ
యురము నొచ్చునటన్న యూహలేక,
కసితీర నీతోడ గలిసి పెనంగితి,
నలయుదు వనియును దలఁపబోక
గీ. మున్ను నీ పొందుకై వాచియున్నదాన
నౌట, సివ మెత్తినటుగా నైతిఁ గాని
యింతరొత్తును కలిగింప నింక మీఁద,
బెదరు మాని క్రమ్మఱను రాగదర స్వామి. 64

చ. హృదయములోన భావములు సెల్లను దెల్పఁగఁ బోవ, భీతి నా
పెదవులు దాఁటియుంచి మన ప్రేమను నడ్డగవచ్చు, వాని నీ

పెదవుల బిగ్గఁ బట్టి వలఁపీడ లొనర్చుచు శిక్ష చేయరా
బెదరును మానుచున్ మణితభేదములన్ హితమున్ ఘటించురా,

శా. స్త్రీవశ్యంబు లెఱింగి, నామనను స్వాధీనంబు గావించు కొ
న్నా వంచించెద? లేచిచో నెచట నైనన్ నావలెన్ సర్వమున్
నీవేయంచు దలంచి, యొక్కమగవానిన్ నమ్మికొన్నట్టి స్త్రీ
లీ విశ్వంబున నుందురా? చెపుము, నీవే యోయి ప్రాణేశ్వరా.

చ, తనివి జనింపకున్నయది కావళరూప మదెంత చూచు చు
న్నను, పలుమారు చూతు ననిశం, బనుదేఱక యుంటివీవునున్
విను, సదుపాయ మొండు వినిపించెదఁ బూర్తిగ నిన్ను బోలు చ
క్కని మగవాని నొక్కరుని గాంచుము నావలనన్ మనోహరా.

సీ. అల్లంతదూరంబునందుండియే నేను
విన 'ఈలలన్' వేసికొనుచు వత్తు,
ఎవరినో వీథిఁ బోయెడివారలం బిల్చి
నట్లు గట్టిగను చప్పటు చఱచు,
వింటిగుమ్మమునకు నెమకుగానిలుచుండి
కేంద్రించి యుమియుగా కేకరింతు,
నేను గన్పడినంతనే స్పష్టముగను జే
తులనెత్తి నాకు సైగల నొనర్తు
గీ ఎవరు చూతురో యనియు నూహింపవేర?
మాయురే పండువంటి నా మనువునకును
నీళ్ళుపోయకయున్న చో, నీవు నాకు
రంకుమగడవు కావటరా! విటకాడ. 68

చ నలువురిలోన నన్నుఁగని నవ్వుచు నిల్తువు, కంటిసైగలం
దలఁపు లెఱుంగజేసెద వెదం జెయిచేర్చి శిరంబు వంతు, వూ

గ్నలు విగిడింతు, వోష్ఠమును ముద్దుల గొగ్గెద, విట్టులైన, న
ట్టలు మవగుట్టు విల్చు! మగడుణ బసివట్టుఁగదా మనోహరా!

చ. గడె కొరజాబు వంపెదవు, కన్పడకున్నను మాటిమాటి కి
క్కడ కరుదెంతు, వింతతమకంబున వేగిరపెట్ట నాకెటుల్
గడచును! నీవు కోరిన ప్రకారముగా వను రేబవళ్ళు నీ
కడఁ బడికాపులుండుమనఁగా, వశమా? మగనాలరా ప్రియా.

చ. రమణుఁడ, నేను రాదికిఁ జరాకును జెందకు, కత్తిరోత కా
డు మగఁడు బ్రహ్మరాక్షసువటుల్ ననుఁ గాఁచియుండు నెట్లుగా
నమయము చిక్కనో మెల్లఁగ, నందొకయించుక కల్గెనేని, నీ
సముఖమువందు ప్రాలుదును చప్పున రెక్కలు దాల్చియైనను.

ఉ. ఇంచుకయేని పై కిరుగ నీయవు, పై మగవారితోడ భా
షించుట కొప్ప, విల్ వెడలఁ జేరవలెన్ నిను, వుస్తెకట్టి పో
షించుమగండు నీ యమలు చేయుదలంపడు, నీకు లొంగినా
నంచును, వింత లోకువలరా యొనరింతువు జార శేఖరా!

ఉ. అమ్మక చెల్ల! కంచు వదునైనది నీ మది యం చెఱింగి, నా
నమ్మతి యొల్లఁ జంపుకొని, సాధ్య మసాధ్యము నెంచ కీవు న
న్నెమ్మెయిఁ ద్రిప్పుకొన్న నటులే తిరుగాడుచు నుంటి, నిట్లుగా
నమ్మతిఁగాన, నెన్నడును నన్నడబాయకుఁ బ్రాణనాయకా,

చ. "వలవదు నీదు చెల్మి, మగవారల నమ్మఁగరా" దటంచు నేఁ
బలుకఁగ, నమ్ముమంచు పలుబాసలు సేయుచు నాదు సమ్మతిన్
బలిమిని బుచ్చుకొంటి, విటుపైఁ గద నీదు నిజం బెఱుంగఁగా
వలెనే నగశాడ, "నమ్మి చెడువారలే" రనుమాట నిల్పరా.

ఉ. అసలు వుట్టునట్టులుగ నచ్చికబుచ్చిక లాడి, యెన్నియో
బాసలు చేసి యూపయి సెబాసు! మొగంబును జూపవేటి వో

రయీ సరసుండ, మోసము సహింపను నీవిటు కృష్ణవేషమున్
వేసిన, భామవేషమును వేసి జడన్ నినుఁ గొట్టెదంజుమీ 75

చ. సరసుఁడవంచు నిన్ గని వసందొనరించితిఁ గాని, సందులం
దిరుగు పదారవిందములు నీవన, నెందుకు మోహమొందుదున్!
దిరిగెడికాలు నీ దయినఁ దిట్టెను పట్టెది నాదునోరు, వే
గిరి మరుడెంచి, ముద్దుల బిగింపుము నాపెదవుల్ మనోహరా.

ఉ. తప్పిద మీవు చేసియును దప్పులు నావయి మోపి చప్పునం
జెప్పక లేచిపోతి వతిచిత్రముగా! నిను నేను వేఁడుకొ
న్నప్పుడె రాఁ దలంచితివొ? పట్టుగ బెట్టుగకూరుచున్న, నే
నొప్పను నీవె ముందుగఁ బ్రియుండ, ననున్ బ్రతిమాలుకోవలెన్

ఉ. ఏమిటి నేను తప్పు ఘటియించితిఁ గన్నులు నెఱ్ఱచేసి న
మ్మోమును ముడించి పోవుటకు! ముక్కున నింతటికోపమా! యిదే
ప్రేమకు లక్షణంబొ? యిటు పెట్టొనరించినఁ దాఁళఁజాల, రా
రా మఱి యల్క పెండ్లికొడుకా! బ్రతిమాలితి నేనముందుగా

ఉ. ఆఁడుది యల్గినం బురుషుఁ డామెను దేర్చుటపోయి, నావయిన్
నేఁ డిటు నీవె యల్గుటయి నేను నిను బ్రతిమాలుకొంటయుం
జూడఁగ వాడవాడలను సుందరు లందఱు నవ్వకుందురా!
మోడిని మాని రాఁ గదర మ్రొక్కెద నీదు పసిండికాళ్లకున్

ఉ. అట్టి విశేషమోహమున నాఁడుదియు న్మగవాఁడునుండ, గన్
కుట్టును ముందదైవమునకున్ మన యిద్దఱిప్రేమఁ జూచి, యి
ప్పట్టున నవ్యదేశములఁ బట్టఁగఁ జేసెను నిన్ను దేవుఁ! డే
న్నెట్టు భవద్వియోగము సహింపఁగఁ జాలుదురా మనోహరా!

ఉ. లేచిన దాది నిద్రకయి లేచినగాఁకను నిన్నుఁ గూర్చి యా
లోచనయేకదా! కలలలో నినుఁ జూచుటయేకదా! నినుం
జూఁచిన దాఁక తాళనను జూడగ వీలుఘటిల్లినంతనే
వే చనుదెమ్ము, క్షేమమును వెంటనె వ్రాయుము యోయినాయకా.

చ. ఉదయమునుండి రాత్రివఱకోప్రియ, నిన్ను గణించి నేఁబదిం
బదిగఁదలంచు చుండెదను, బాలమెటుల్ వలబాఱుచుండువో
గద! యొకమారు నే నటులు గాఁ బలబాఱుటలేరు నన్ను నీ
వు దలఁచు చుందువో, తలఁచవో పయివింతలలోన మున్గుమన్!

ఉ. ఆ పయి చోట కలుగు జనరాడ్రుమ్నుఁ జక్కసిమాయఁగాంగ్రునుం
గాఁపుర ముండ్రు, వారలు పగల్ కురియింతురు, లేని మోహముమ్
జూపుచు, రిచ్చకంబులకుఁ జొత్తురు, వారలమాయ లందు నీ
వేపగిదిం దగుల్కొనక యిచ్చటికిన్ మరలంగ వత్తువో! 83

ఉ. ఆ నవ, రా సమాదరణ మానల, పాయభిమాన, మాప్రియం
బానయ, మిన్నియుఁగ సతములంచుఁ దలంచుచు పొంగుచుంటినే
గాని, హతాత్తుగాఁగ మన కాఁపుర మిట్టుల తెల్లవారునం
చే నెఱుఁగన్ దినంబులిఁక నెట్టుల దాటుదు నాథవల్లభా 84

ఉ. కన్నులనీటిచే కరఁగి. కాటుక రేఖలు నాదు చెక్కులం
దున్నవి నీవు నిర్దయఁ బ్రియుండ ననున్ విడనాడినంత నుం
డి, న్నిరతంబు నే బడిన నెవ్వగ నియ్యవి లేఖలౌచుఁ దె
ల్పు న్నయనంబులం దెఱచి, పూర్ణకృపం దిలకింపు నాదెసన్

ఉ. కోరిన పూరుషుండు సమకూరెను, గోరిన యట్లతండు నన్
గూరిమిఁ జూచుచుండె, రమణుల్ మఱియెవ్వరు నాకు సాటి! యం
చూరక నేను గొండవఱునుండఁగ, నన్ విడనాడి నీవు నా
కోరికలెల్ల నేలకును గూలిచినాఁడవు నిర్దయాత్ముఁడా 86

చ. వలచితి నిన్ను, నీ వలపు వాంఛ యొనర్చి గడించితిన్ నినుం
గలిసితి, నీవునన్ కలియఁగా సుఖవార్ధిని మునిఁ తేలితిం
జెలువుఁడ, జన్మ సార్థకత చెందితి, నీవెడఁబాసి తంచుఁ జిం
తిల, నలనాఁటిసౌఖ్యము మదిం దలపోయుచుఁ దృప్తిచెందెదన్

చ నీకు నతి వారు నీరవక విశ్వము నీకొఱ కట్టి నన్నుఁ బో
విడిచితివా! యెప్పుడును నీడ, న టన్న బ్రమాణవాక్యముల్

విడిచితివా! నగాజనులు నిన్నను సిగ్గగు నన్న భీతియుం
విడిచితివా! సరే, విడిచిపెట్టుము దోసెడు నీళ్ళు నాకు నై.

మ పిటరాయా, మఱుమాయమాటలను వేవేలాడి మున్నీవు న
న్నటులో ఋప్పఁగఁ జేసినాఁడ, వదినేఁడేమయ్యో! మూన్నాళ్ళము
చ్చటకా నిన్నటు వీధిఁ బెట్టితి? వెడఁగ జంకైనను బుట్ట లే
దటరా! యప్పుడె క్రొత్తవింత చెడి యాహా! ప్రాంతిరోతయ్యెనా

ఉ వేళ లభింపదాయెనని, వీలుఘటిల్లక యున్నదంచు, ని
ల్లాలికి కోపమంచు మిషలన్ వచియించెద వేర నా పయిన్
శాళి నశించె నన్నదె నిబద్ధిర నీకపుడొక్క చొక్కపున్
బాలికయే తటస్థ మయినన్ గ్రహియింపక మానుకొందువా!

చ మఱి నొకంగనో మిగుల మక్కువ చూపనొ? భక్తిగొడ నీ
పదముల లొంగనో? హృదయపద్మములో నెల నిన్ను దేవుఁగా
ననుదినమున్ స్మరింపనో? ప్రియా నను గాయుట కేమిదోష మే
నొనరించితిన్ ప్రమాద మెదియో ఘటిల్లిన సైఁపఁజెల్లదే!

చ కులికము గల్గె మున్న నను గూడుట కాతిమి యెల్ల నిప్పుడ
ద్భుతముగఁ బోయె నో ప్రియుడఁ దూరపు కొండలు చేసు నై నఖ
క్షతముల నున్నపాయుటనొ? కాక తినం దినగారెలందుఁ జే
దు తగులు నల్లుగా నరుచి తోఁచెనో నామధురాధరంబునన్

చ ఒడఁబడకుండ నే బిగిసియున్న దినంబుల నాదు పొందుకై
పడఁగను రాని పాట్లుపడి వల్మరువన్ బ్రతిమాలుకొంటి. వి
య్యెడ మొగమైనఁజూప విదియేమిఁ యొక్క తీరినంత, నె
క్కడ ప్రియు లన్న పాట వగకాఁడ, యదార్థము చేసినాఁడవా

ఉ. నొచ్చ నటంచు నీ పెదవి నొక్కఁగనైతిని, నొచ్చువంచు నిం
గుర్చి కవుంగిలింప మదికోర్కులు తీఱఁగ కాల మున్న దం

చిచ్చ యడంచుకొంచుఁ జరియించుచు నుండఁగ, నింతలోననే
తెచ్చె వియోగ మయ్యయొ. విధిన్ మఱియెవ్విధిఁదిట్టుదుం బ్రియా

మ. సరసుండై సరిగాఁగఁ జెక్కసతులన్ సంప్రీతి శ్రీకృష్ణుఁ డొ
క్కరుఁడే నల్వఁగఁజాలె, తక్కొరుల కక్కార్యంబు శక్యంబె! "ఋ
ద్ధతి పొందేలర! మద్దువ" ద్దనిన, మున్ దర్పంబు పీవాడి య
ద్దిర! నేఁడింటిభయంబు నొక్కమిమగాఁ దెల్పంగ నెట్లొప్పుదున్

మ. ఎలమిన్ నీవిటులుండ, నేసవతి తామా యేరాలొ యీనూని క
న్నులలో నిప్పులు పోసికొంచు మన పొందుంబాపె, నీకొఁగిటం
గులుకం గోరియు! దాని నాయుస రిఁకం గొట్టన్వలెన్ నాథ! నా
వలెనే యుద్దియు నీకు దూర మయి తీవ్రగ్లాని పొందన్ వలెన్!

శా. నీవింకొక తెమీఁద రంగుపడి దానింగూడి యుప్పొంగుచున్
వేవేభంగులక్రింద మీఁదఁబడ మీస్వేచ్ఛావిహారంబులన్
నేవారింపగనుగాని, యొక్కటి మదిన్ సక్కంబుగా నెంచుకో
మ్మావంతైనను నీకు నాయుబును లేదన్నటులుండన్ వలెన్

ఉ. వింటెని వింటి నీకిపుడు వేఁడుక క్రైయొకర్తు కొత్తగా
వంటవమ్యొంట' యటులొటను నన్నుఁడఁ బెట్టి తంట నా
యింటికి రాకయుండ నవియే మొలలోఁ జెయి పెట్టియాఁపెనో!
వెంటనె యాఫలం బనుభవించెద. వుండర నీవుధూర్తుఁడా 98

ఉ. ఓరి, వనుం ద్వకించి మఱియొక్క తెకుం దగులాట మైతివా!
కూరిమి మీరలిద్దఱును గుల్కఁదలంచితిరా! సరే మిముస్
దూరము చేసి, నాసవతి తుళ్ళడఁగించి కలంపకున్న నా
పేరును బెట్టి నన్నిఁకను బిల్వకురా సరివారి లోపలన్. 99

ఉ. మంగళ మేను నీకుఁ బలుమారును గోరెద, నీవు నన్ను నే
భంగిఁగఁ జేసినన్ సరియె, పాలనుముంపుము, నీళ్ళముంపు, మా
సంగతితోడ నాకొక ప్రసక్తియు లేదు, శుభాంగ, నిత్యమున్
మంగళ మౌతనీకు, జయమంగళమున్, శుభమంగళంబునున్. 100

బాబులు రెండుభాగములు సంపూర్ణము.

సరసోక్తియుక్త

# కృష్ణశతకము



గ్రంథకర్త:

సెట్టి లక్ష్మీనరసింహ్వాము.

## —• సరసోక్తులు. •—

— (౦) —

'రామాయణము అంకు, భారతము బొంకు'

'బూతుమాట లాడితే, కాని వ్రాతకు సంకెళ్ళు పడతాయి

'బూతు లేదు ఆతు లేదు, కాలెత్తవమ్మా కర్ర నెడతాను'

శ్రీ ర స్తు.

# సరసోక్తియుక్త

# కృష్ణ శతకము.

శ్రీరమణీకళత్ర, సర
 సీరుహపత్రవిశాలనేత్ర, వి
స్తారకృపారసంబునఁ బ్ర
 జాళిరక్షణ మొనర్ప నస్మ భూ
భారము వృద్ధి గాఁగ, నది
 బాపఁగఁ గృష్ణుఁడ వై జనింపవే?
'నేరిచి వచ్చినన్ గడుపు
 నేరుఁ గోడనె దించుకో వలెన్',

క. హరిహరి! 'గాడిద మొద్దయె
గరుడస్తంభంబు' గాఁగ గాడిద కాళ్లన్
శిర మిడ వసుదేవుం డది
యఱిచిన నీకారి గల్గు నని శ్రీకృష్ణా 2

క. ప్రియమున దేవకి కనె ని
న్నా, యశోదకు నేగతిం దనూజుండవు నీ
వయితో? "దెంగులు గుఱ్ఱము
నియఁ బిడ్డ దివాణము' దను విధమున గృష్ణా. 3

ఉ అంగన లెల్ల గొడ్డు ముసలమ్మ యశోద కుమారు గాంచె నం
చుంగవలాయతాక్ష, నిను జూడఁగ సాగిరి యద్భుతంబు హె
చ్చంగ 'విచిత్రవిప్రునకు చన్నులు పుట్టఁగ విప్ర నందు, వం
చాంగపుబ్రాహ్మణుండు సారులు జూచుచు వచ్చి నట్లుగన్.

ఆ. వె నీవుబొడ్డు తమ్మివి రించి యుంట నీ
బొడ్డుకోయ, నతని మొద్దు తెగునో?
"బొడ్డుకోయ, బోయి మొద్దు గోసిన యట్టు"
లనుచు జంకె దాది యబ్జనాథ. 5

ఉ. మాధవ, పల్లెలో నులకమంచముపై నిదు వేసికొంచు తా
బాధలు చెన్నటంబడియె, గాఁతియమునం బుప్పఁబొన్ను మీఁద ని
న్నే ధవురీతిఁ జేర్చికొని యోగము మన్మథసౌఖ్యములు గనెన్
రాధిక వచ్చ నుచ్చయును, ద్రోకను జేయు యటన్న నైఖ్యన్

ఉ. కొంచెపుపాలు మాఁగె రసికుం డగుమం గసి దీని రాధికన్
వంచెను చిన్నికృష్ణుఁడు ముకుందబొనఁ గూర్చుమ యన్న నార్తి చా
టించిన యువ్లు ధాత్రిఁ బ్రికరించెను పూకను సొప్పుచేసి వా
యించుట" యన్నమాట కిదయే యగు కారణ మగ్రధారణా

చ. వంబు విరహాంపునొప్పులకుఁ జాల్వికి మోహాముగన్న గోపికల్
కటకట! నీవు ప్రక్కఁబడఁగాఁ గడుఁ గోయు, వస్త్రహీన లై
తటుకునఁ బికుఁ గన్పడఁగఁ బదియు జంకరి "మంత్రసానిముం
దటకె యుపస్థ దాఁచిన" విధంబున గోపవధూమనోహరా 23

తే గీ. 'పదిని వెల్వడి చేయెత్తి నాకు మ్రొక్క,
చేలముల నిత్తు', నని నీవు చెప్ప, గొల్ల
పడఁతులకు "పూకులోఁ గుంచు, బావగారి
వైద్య" మను నట్టు లాయె నోవారిజాక్ష 23

—♦ ర త్నా వ ళి ♦—

"అమ్మఘవుజాతరన్ మూనివచో నావద వాటిల్లు పటంచుఁ
నెమ్మది భయపడనేల? "పూకు పెండ్లికి నగరకలకి ఘర్ణం గాజా
సుమ్మ, మొడ్డపెండ్లికి ముఖలింగవుసాన్నాయిసు" మ్మనుటయిదియే
నమ్మ." డని నీవు గొల్లలన్ చూప్ప, నగము నెత్తలేదే శౌరీ

తే. గీ. వ్రజ సంరంభమున ఆల వాన కురిసి
తుదకు 'నత్తె, పికొడుకు గందోళిగాఁడె,
వత్తిమీఁద చేతిని వేసి పల్కకుండు
నను నటులెచేసె, కృష్ణ, నీ వది నెత్తి! 25

తే. గీ. వనజనాభ నీ మొగముసొం పునకు వలచి,
పడఁతు లెందఱో నీవయిఁ బడిరి "మొగము
తేట పూకుకు చేటను మాట గలదు,
ముగము తేట మొడ్డకును జేటగుటక్రొత్త 26

ఉ. వేడుకకాఁడ వివ్వనవీథిఁ దొలంగి చనంగ, గొల్లవూ
బోఁడులు నీదువేషమున బూనుచుఁ గొందఱుఁ, గొందఱింతులై
క్రీడయొనర్చినారఁట! హరీ, విరహంబున నేమిలాభ మో!
బోడియు బోడియుంగలియ బూడిదరాలు నటం చెఱుంగరో!

ఆ. వె. బృంద యందుఁ దిరిగి పెనుగనిన్ సాధింప
నేగ కారె! కంసి నృపతిచేత
కాన మగఁడు పూకుపైని గుద్దివయ్యఁల్లు
నీముసికలఁ జెలిను నిలిపె గృష్ణ 35

చ. అనయము గోపికాజన సహస్రము తోడను రాసకేళిగోఁ
దనరుచు బృంద నున్న నినుఁ దా మధురన్ వధియింపఁ బిల్వ బం
పిన యల కంసు డీల్గె గదె? వెల్గున గల్గిన కొఱ్ఱి తీసి గు
ద్దను దిగ గొట్టుకొంటను నీ దర్పణ మిద్దె సుదర్శనాయుధా. 36

తే. గీ. అదనునను వస్త్రగంధమాల్యాదులు లభి
యింపగ గ్రహించి కుబ్జతో నింపున రమి
యించి, కంసుని బరిమార్చి నేగితి హరి!
అడవిఁగొ వెంగి యాకున దుడిచి నట్లు. 37

శా. ఓరీ బాలకా, వజ్రకర్కశమదీ యోరస్థలం బైన గ
న్గోరా పొరక పొం యుంచుకొను చాణూరుం డనన్, వానితో
నీరేజేక్షణా, పూకు పూకెడును, పైనిగా దోసె డన్నట్టులే
రారా నావు లోనర్పి? పోరగను రా రా, యుం చిలం గూల్పవా.

తే. గీ. దుష్టుఁగు వారు నీకు బంధువులెయ్యెన,
నవని గూల్పవె వారి? మేనత్త కొడుక,
మెల్లగా దెంగరా యన్న మిన్న కుండు
వట్టివెర్రియు గలదె కంసాసురారి. 39

ఉ. గోకులభూమికిన్ మగుడగొబ్బున రామిని నీదు రాకడన్
రాకఁ గల్వలట్లు వ్రితిరాత్రియుఁ జూచుచు మన్మథజ్వర
వ్యాకులలైన గొల్లజవరాండ్రకు నక్కట! మిక్కుటంబుగా
పూకువఁబోటు, బుజ్జినలువుంగి గలిగెన్ మథురాపురీచరా
తే. గీ. మింకల మఱుగుజ్జ గాన నిమ్మెలఁత మేన

ఉ. చక్కఁగఁబోయె రుక్మిణి వృథాగ నటంచును జైద్యుఁ డేడ్వఁగా,
మిక్కిలి రుక్మిదుఃఖపడె మీసము చక్కఁగఁ బోయెనే యటం
చక్కట! ఇల్లు కాలిన దటంచు నొకం డొకఁ డ్రక్కసేడ్వ, వే
ఱొకఁడు నుల్లకాలెనని యొక్కఁడ నేడ్చినటులు, జనార్దనా

మ. తనభక్తిన్ దిననాథునిం దనిపి సత్రాజిత్తు మాణిక్యమున్,
గొని తే, నయ్యది సత్యకుం బెదవిరంగుం గల్గుటం గోరి, దొం
గను నీవారక తెచ్చుకొంటివిగదా! కూ డెల్లగానున్న కూ
డను దెమ్మం చడుగన్ మతేమియగు? నో దామోదరా శ్రీధరా

తే. గీ. ఓ హృషీకేశ, దొంగఁగా నొప్పకొనదొ, మొద్దకొసికొమ్మ నదొ
యగా పోల్కి సత్య పారిజాతంబు తేకున్న ప్రాణములను
విడుతునన్నఁ, దెచ్చితివది పుడమి కదిర! 51

తే. గీ. తాను వేఁడఁగా నరకవధం బొనర్చి తనిన మోమోటమును
లేక, యమరతరువుఁ గూర్చి వజ్రినితోఁ బోరొనర్చి కృష్ణ
ఒడ్డు గడప మొద్దనుజాపు టున్న దెగద! 52

తే. గీ. గర్వమున బాణుఁ డధికుఁతోఁ గలనుకోరు కొనఁగ, నీచేత
బాహువులు కూలెగృష్ణ' గొప్పకొండొప్పికాలుచుకొనఁగ, వేగి
నంగకెరువునుమంటయు నన్నయట్లు

ఉ. చేతులు వేయి నీకగుటచేతన మేటిమగండ పౌదే? వృ
ధ్వీతల మం దొకించుకయు దొంగఁగఁజాలని యట్టి మొద్దె యా
రా! తెగ బారెడంచు విన వా? యని యుల్లస మాడి సాణుసిన్
శాతశరాళి నొంచితివి సారసలోచన, పాపమోచనా 53

చ. నినుఁ గని, శంఖచక్రములు నీవలెనే ధరియించి, నీగతిం
గిపకను వాసుదేవుఁ డను నామము కద్దను పౌండ్రకుండిలన్
మును తెగటార్చె, నమ్మివలె పూరుడుపిట్టయు గుడ్లు పెట్టెఁ జొ
చ్చినయెడల పూరు బ్రద్దలయి చెచ్చుట, నచ్చుమగాదె? యచ్యుతా

ఉత్సాహ

బిట్టు భక్తితోడ నిన్ను భీష్మముఖులు కొలచి క
న్నట్టి మోదమున రచంతయైన దా నెఱుంగమిం,
దిట్టె సభను గన్ బురాణపూరుషా

పుట్టుకుంక యే మెరుంగు పోటునందు గల రుచిన్!

శా. పంతింబున్ విడు, నూరుతప్పులను గావచ్చెంజుమా, నిన్నిఁకన్
ద్రుంతున్ వే శిశుపాల హేతి వృత శాతులు చీకకో, కంచదా
యంతేఁట కంతులు పుట్టిజమ్మని యనంతా, నీవె వారించినన్
గంతులు మానని వాని పళ్ళెరమునన్ ఖండింపవే వింతగన్!

చ. మచ్చరమూర నిన్ను బలు మానభవమాన మొనర్చు చైద్యుపై
దెచ్చెర పళ్ళెరం బొకటి చేతను గైకొని నీవు వేయగా
వచ్చెరు వార జచ్చెనుగదా! గ్రహచారము చాల కుచ్చుచో,
కచ్చను గల్గుమొద్ద భుజ గంబయి చంపుమ గాదె శ్రీహరి.

చ. మిగులగ గల్మియిత్తు వని మిత్రుకు రాగ, కుచేల, నాకు నీ
యగ గొని తెచ్చితే యడుకు? లంచు భుజించితి వౌర కృష్ణ! ఇ
ట్లెకురుచు దెంగుచుంటి, విపుడేమియొసంగవో? యన్న మెప్పుగొ
ల్పగ, తలగుడ్డ యిత్తునని భావనచేసితి వన్నయట్లుగన్, 59

ఆ. వె. పిడికె డడుకులిచ్చి యనుగుల నొత్తించుకొని, కుచేలు డొందె
గొప్పతనము శ్రీత డబ్బునిచ్చి, పత్తను జినుగంగ
దెంగు టిదె, కదాయ సంగజనక! 60

ఆ. వె. అల్ల సురేంద్రఖాండవము నగ్ని దహింపగ గోరి నిన్ను దా
దొల్లి సమాశ్రయింప, నరు తోడనుపాయ మొసంగి, ఖాండవం
బెల్లను గాల్చ నీ వతనిని కీయగ కోరె యనుజ్ఞ? అత్త పూ
కల్లుడు ధార పోసె నను నట్లుగ నాయె గదా గదాధరా!

ఉ. పుట్టము లొల్వ బుట్టములు పుట్టగ నీకృపచేత గృష్ణ. కిం
కెట్టులు మానభంగ మిపు డీ మెకు నే నొవరింప జాలుదున్?
పెట్టిన యంతయున్న యదె పెండిలికూతుర, యన్నయట్లు క
ప్పట్టె నటంచు కౌరవు డుపాయము శోచక మూన శ్రీహరీ.

ఉ. హెచ్చుగ వద్దు, పాండవుల కేవురికొ కొక్కకయూర లెక్కనే
యిచ్చిన చాలు కౌరవ పతీ యని సంధిని నీవొనర్పగా
వచ్చిన ధిక్కరించి చెడ వాడు మొకల్ చెడి మొద్దచేతికిన్
వచ్చినటుల్ ఘటిల్లెను ది వాకరవిక్రియ, రాత్రివిక్రియా.

ఉ. తల్లి సహోదరుండొకడు తప్పుతు ప్రిడొకడు, నైన లోకముం

దల్లరి బావ గంటు, పరకాముకు, దుర్గుణవడె? కృష్ణ, బంధువులం
దెల్లర గూల్పగా నరుని వికగీతలు చెప్పుట బ్రమే
తల్లిని దెంగు నట్లు పిన తల్లియు కప్పనమానయే నుటా.

ఉ. తాతలు తండ్రు లన్నలును, దమ్ముళ్లు పుత్రులు తోడివారు నా
మాతి తెమర్పుటం 'దొలిస మర్తన గూడ' దు లన్న రీతిగా
చేతుల విల్లు వ్రాసుటకె? చిత్తము గొల్లని సవ్యసాచికిన్
గీత లుపన్యసించి మది ఖేదముఁ బాపితి పార్థసారథీ.

ఉ. దొంగతనంబునం బసుల తోఁకలకుం బసి వాండ్ర జుట్టు లం
టంగనుగట్టి యల్లరి రౌయి నర్చిన నీకు నృపాలకోటిలో
సంగర ముద్భవిల్లు నటు సల్పుట శ్రోత్రయో? పానిపావకన్
దెంగులు నేర్పఁగా వలెనె? దీనజనావన, భవ్యజీవనా.

తే. గీ. ఈవు కురుయుద్ధమున జక్రిమెత్తననియు, కౌంతవునిమీది
కెత్తితివె చక్రిహస్త? 'మాటలకు నాతుల కభేద' మాట,
మాటయుంటివేమొ? నిల్వుకొన. నీకైన వశమె.

శా. "భంగిందెల్పెదద్రోణుగూల్చ 'పడె నశ్వత్థామ' యంచంతమా
తండం బన్నని ధర్మనూనునకు బోధంజేసి, సత్యంబు మా
ర్చంగా నాతడు బంక, నీవతనికో, శాస్త్రప్రకారంబుగా
దెంగం, బుట్టును గుక్క-పిల్ల" లన లేదె? ధూర్తగోపాలకా. 68

చ. గదగొని భీమసేనుడును గాండివముంగొని క్రీడి నిల్వగా;
కదనమునందు నీ వెవుడు గాచెదు పాండవసేన గర్ణ పొం
దొదవుట జేసి గెల్వగ సుయోధను దూహరయొనర్చె నద్దిరా!
ఇదె కద, 'బుడ్డనమ్ముకొని యేటను బడ్డ విధంబు మాధవా.

క. తొలుతటిజన్మమునందుం జెలియలగు సుభద్ర సతిగఁ జేకొంటిగదా
బళిర! మహిమేఁ? నీకిఁక తలతిమ్మఁడు, గుద్దబావ, కాండవకృష్ణా

ఆ వె. వనజభవునికైన వర్ణింపరాని నీమహిమయందు మాధమానసుండ
నెంత పొగడనేర్తునన్? దోమదెంగఁగ నెంతసాదుకార నెంత? కృష్ణ

ఉ. నాకొలదిమది నవంశంబై కన్పడు నీదుమహిమనంతయు నిలువం
జేతును, పిల్లిపూకున రోకటిఁ దూర్చి నట్టి రూపునఁగృష్ణా! 72

క. అద్యుఁడ, విశ్వేశ్వరుఁడ, న త్యధికుడవు, నిన్ను గొల్వ బ్ర

కన్నద్యము నాళినేర్వ. రటులయ్యెనుఁ బూర్వముగానిభక్తితో
ఉద్యమమునే నొసఁచ్చితిని నుల్లము నీకడ, గొల్లిగిల్లిసై
వేద్యము పెట్టిఁట్లు లరవిందదళాక్ష యెటుల్ గ్రహించెదో

క. ఘనుఁడ వగునీకు నేమదివవయుంబును సల్పు సేవయల్పమయినఁగై
కొనుమా, కొండంతటి దేవునకున్ సిండంతవత్రి పోల్కినిగృష్ణా

చ. కమలదళాక్ష నీవయిని కాంక్ష మదీయమనోబిసప్రసూ
నము సిపుడే సమర్పణ మొనర్పఁగ వచ్చితిఁ, భావవాంఛిత
భ్రమరసమాకులం బగుటఁబట్టి గ్రహింపఁగ మానదేమొ! పు
ణ్యమునకుఁ బూకొసంగునెడ, నాతులుగల్గుట కల్గి వట్టుగా

క. ఆత్మనొసఁగు వాఁకె వరమాత్మా! మోక్షమని నీకు నర్పించితినా
యాత్మను, హాత్మే పైసా చూత్మేలవడాయటన్న చొప్పిదియొకదా!

క. చేతమున దైవభక్తి ప్రభూతం బగువేళ నిన్ను బోలినదైవం
బీతటి నాకులభించుట, ఆఁతులలోఁ దేనవట్టి వ ల్లయ్యో హారీ 71

తే.గీ. ఎన్నడో నీపదధ్యాన మేను సలుపుచున్న, ప్రతిబింబంబును
నన్నుఁబోవిడాయ ర మ్మందు ఇచ్చుట డబ్బుగాని,
ద్రొబ్బుటొక జాము వరయు, నో తో యబాక్ష 78

క. దానతపోజపలములు, సమ్మెనివవిత్రత, యువస్థ మినహా కన్యా
దానంబు రీతి వ్యర్థములే, నీపదభక్తిలేనియెడలన్ గృష్ణా 79

మ. జనులీలోకవు దుచ్ఛసౌఖ్యముల విచ్చంగోరి లుచ్ఛాప్రవ
ర్తనులైనన్ మఱవంగ. వాసలకు బంతం బందు రాకుండఁ ద
ప్పను జన్మక్షయమోక్షసౌఖ్యచయముల్ మాట్లోలికింబూకునా
కిన ముప్పావల కమ్మి చిక్కపడు భంగిన్ దేవకీనందనా 80

తే.గీ. నీదు సేవచే నాకు జనించుపుణ్య గణము చెడుఁ, జెడుకోర్కెలఁ
గలిగెడిఁ దురితములచే అవ్వతీయు గంధంబు కాత
బుడ్డకున్సరి యనియెడి పోల్కిఁగృష్ణ 81

చ. అనుపమతావకాంఘ్రియుగ రాధికచింతన పాపబుద్ధి న
వ్వనమున బుట్ట దట్లయిన, మామకచిత్తమఘౌఘ మందునే
మునిగెను, గొడ్డుపూకునకు మొద్దలు దండుగ యున్న యట్టిరీ
తిని, పురుషోత్తమా, నను మ దంగరుణించి, యఘాళి బాపమే

మ. "ఇది నాయింద్రియవర్గమట్లగుటచే స్వేచ్ఛన్ మెలంగింతు," నం
చు దలంపగను, బావురే! విహితు డంచున్నీవు నెక్కించుకొ
న్నన, దిగంబారుచు గుద్ద దెంగె నను చం దావన్ బడంద్రోసె ను
న్మదరేఖ నన్ను మదింద్రియంబులు, ముకుందా, రమ్యకందార్పక!

— స్ర గ్వి ణి —

దెంగుచున్నన్, సదా దెంగుచే, మాని వే
యంగ, లింగందు తె య్యంచు లోంగం డికే
భంగిగా నిల్చు నీ పైని నాయాత్మ! నే
"దెంగనా, మాననా దేవకీనందనా!

క. ఏటికి నిను దలపగ నఘ
కోటి దొలతు ననెడిబిగదు గొంటివయో! మో
మోటుమునకు బోవగ, గడు
పా టెరుగవె! పావ వే మ దఘముల జక్రి? ౬౫

— ర త్నా వ ళి —

మ. భవబంధంబుల యందు జిక్కువడి నే బాపంబులం జేసినన్
భవదీయాశ్రితరక్షణత్వబిరుదే పాడై చనన్ వీకు పా
పవిశేషంబుగ నంచు విడకుమి నన్ పెండ్లామువై గోపము
ద్భవిలన్ చుల్లక గోసికొన్నట్లు యశో దా. శ్రీయశో దాత్మజా,

ఆ.వె. "గుడ్డివాని కెపుడు మొడ్డమీదన లోక
మెంటులో, యటులె జ్ఞాన దృష్టిలేని
నాకు బాపమందె లోక మయ్యాంబికే
యునికి బోలెజాపు నొసగు గృష్ణ. 89

యాదవాన్వయాంబోధిచంద్ర, చంద్రాభనిర్మలయశసాంద్రా
నా దు మానసంబున బుట్టిన యజ్ఞానము పోవ్రట దుర్లభమా
"గూదవు రాసిన రతారికతవుడున్ గుంజినన్ వదల" దనుకీటన్

నీదయాప్రవాహమున నెప్పుడు నానిచి, యేగతి దొలగించెదవో!

ఉ. చాల నఘాళి నామనము స్వల్ప దొడంగగ, నింద్రియంబులన్
పీలగు నంత దోడుపడి వెంటనె వర్తిలు నుత్తమంపుటి
ల్లాలెప్పుడైన నూరువెడ లంగనె, యూరిని గల్గుచుల్ల ల
శ్బాలకు సారికావడుల భంగిని వచ్చును గాదె యచ్యుతా.

ఆ వె. ఒడలు సోమరితన మొందింప మదిపాప
చింతగొలుప, నీదు సేవ మరతు
కుక్క గూడ పట్టుకొని లాగ, అత్తయు
సిగను బట్టిలాగు పగిది కృష్ణ. 91

ఉ. అంబుజనాభ నంచు మన మా, వినయంబును బూను, మన్న స
త్యంబుగ ధూర్త లక్షణము దంచును బూనదు డెంద, మేమిశ
ర్మంబొకొ సాధుతాగ్రిగర సమాదిగ యున్నసహించదమ్మయాం
బం బొనరించు నన్నలు కృపన్ వినయం బొనగూర్పు శ్రీహరీ.

శా. ఊహాతీతము నీమహత్త్వమది యత్యుత్కృష్టమే యైనను౯
సాహంకారులు దేవతాధముల మాహాత్మ్యంబె వర్ణింతు రెం
తే హర్షంబున! మాచకమ్మ చనుదోయిం గాంచి సన్యాసిగా
డాహా! చంకలు గుద్దుకొన్న గతి సత్యాచిత్తసత్యప్రియా. 92

తే. గీ. నీకు నన్యదైవతముల కే కరసిని
పోల్కి గలుగంగ నేర్చునె! బూతుపిల్లి
గడ్డకు౯ మరి గాడిద మొద్దకు నెట్లు
సామ్యమగు వార్ధిశయన యో జలజనయన. 93

ఉ. ఇచ్చినగోర్కు వాంఛితములెల్లను దైవతధేనువట్లుగా
నిచ్చెలునిచ్చునిన్ విడిచి, నీచులు పైబడి బాధపెట్టగాఁ
జొచ్చెడి క్షుద్రదేవతల జూచి భజించెద రో ముకుంద, పా
లిచ్చెడి యావు నమ్మి పయికెక్కుచు దెంగడియొద్దు గొన్నటుల్

ఆ. వె. అతనుజనక పావతటిఁ బాపుకొన నీకు
సేవలేదె, క్షుద్రదేవసేవఁ

గానిలంగ నేల? కత్తిలేదే యీశ
కొఱకు పూఁతకాల్చఁ గొనఁగ నేల?

తే.గీ. దేవదేవ, చిన్నాలను లేవు, సాటి
కలుమ లేవు! సిండను నీళ్ళకారె వన్న
భంగిక్షుద్రదైవముల గొల్వంగ ముక్తి
యీరు సిరి యీరు మదిక్షోభయే ఫలంబు 96

ఉ. ఏ కడనేని రౌద్రగుణమే వహియించిన క్షుద్రదేవతా
నీకములన్ భజించినను నిక్కముగాఁ దమరౌద్రభావమే
కాక మ ఱేమి చూపుదురు! కంసవిమర్దన, యోజనార్దనా
పూజనుబూజసేయుటకుఁ బోయిన నిత్తురె చూపు వత్తఁ జేఁ

చ. అసదృశకృత్యవన్ శ్రితజనాళిని బ్రోచెడి నీవు సల్ప పూ
జ సలుపఁ, దృప్తిగాంతు, వుపచారశతంబుల క్షుద్రదేవతల్
పినరును నంతసంపడరు, పెట్టనిపోయని యప్పుగండె పి
త్తసిరుగ జెంగుచుందును గదా! మురళీధర. రామసోదరా

క. నినువమ్మితిగావున, నా
మనమున సుగుణములకొఱకు, మాటికి వెదుకం
జన దో కౌస్తుభధర, యా
"ప్రతిశల్యపరీక్ష" కాఁగఁ జాలదుటనుమిన్నా. 99

ఉ. నా మన సెట్టి దుర్గుణగణంబులతోడను నిండియున్న, స
న్నోమ్మియుఁడు లక్ష్మి నీవుఁ, దనయుం దలిదండ్రులువోలె నెంతయుం
బ్రేతు, స నా ర తింబుమిచువీడకయుండెదఁ "కుక్క జెంకి" నాన్
స్వామి, నృ సిం హ పుణ్యపురుషా, దయాపయోనిధీ.

సరసోక్తియుక్త

శ్రీ కృష్ణశతకము

సంపూర్ణము

# పీఠిక

పూర్వకవీంద్రులచే రచింపఁబడిన గ్రంథము లింక నెన్ని యెన్ని యెక్కడ యెక్కడ నడఁగియున్నవో యెవరి కెఱుక! ఈ వైశాఖమాసమున మాబంధువులలో నొకరి యింటనైన వివాహమునకు సింహాచలపు టడివారమునకుఁ బోయి యుండి యక్కడనొక శ్రీవైష్ణవ గృహస్థునిం బ్రాఁతతాటియాకుల పొత్తములను దిరుగవేయుచుండ నాకు "రసికాభిలాషము" అను నీచిన్ని పొత్తము లభించినది. కవియెవరో తెలియక. "వీధినాటకము" కూడ దీనితోఁ గలసి యున్నందున శ్రీనాథుఁడాయని యనుమానించి, కవితాశైలియుఁ గల్పనాప్రౌఢిమయు శృంగారరసవిస్తరతయు నాయనుమానమును బలపఱుపఁగాఁ జివరనుఁజూచి, గద్యము లేకపోయినను దుదిపద్యము చక్రబంధముగుటఁ బోల్చి, యందు "శృంగార శ్రీనాథ" యను పేరేర్పడుటచే శ్రీనాథుని గ్రంథమేయని సిద్ధాంతము చేసితిని, గ్రంథమంతయు సావకాశముగాఁ జదివిన వెనుక 38, 39, పద్యములవలన మిగిలిన కొంచెము సంశయమును నిర్మూలమైనది. శృంగారమన్న విమతప్రాయముగాఁ జూడఁ దలయూఁచువారలెవ్వరు నిప్పటియాంధ్రులకు శృంగార భూయిష్ఠమగు నీపుస్తకము రుచింపమి విదితమే. కావున దీనిని బ్రచురింపఁగూడదని మొదట నిశ్చయించినను, శ్రీనాథకవి యంతటివాని గ్రంథముల లోకమున వెల్లడిచేయుటకుఁ జేయకపోవుటకు నొకరియిష్టము కాదని తలఁచి తుదకుఁ బ్రచురింప నిశ్చయించి విశాఖపట్టణమునందలి శ్రీశారదాముకుట ముద్రాక్షరశాలాధికారులగు మ. రా. రా. చిన్నకోట అప్పలనరసింహా శ్రేష్ఠిగారికి జూప వారు దానిని దామే ప్రచురింపఁ గోరి తీసికొనిరి. దీనిని వసీన కవియే యొకఁడు రచించి ప్రచురించినచో విమర్శకు లెట్లు దూషించియుందురో దేవునికే తెలియును!

శ్రీనాథుని వీధినాటకము లోకమునఁ బ్రచురమయ్యె నీరసికాభిలాషము కానందులకుఁ గారణము లేకపోలేదు. ఇందుఁ గవి యుద్దేశించిన నాయిక గొప్పరాజాయింటి దనుట నిశ్చయము. 8 వ పద్యమునందలి "యందని ప్రాణిపండు" అను మాటయు, 49వ పద్యమునందలి 'భోగినీమణిరో' యనుమాటయు దానికి నిదర్శనములు. శ్రీనాథునికి కోరిక తీరినట్లు కాని తీఱ దనువాడయున్నట్లు కాని యెక్కడను గనఁబడదు. ఈమె యెవతెయో! యెక్కడిదో! కన్యకాదని 21 వ పదమునదలి "పరకాంత నిన్ను" ననుమాటయు, జారచింత గలదని 19 వపద్యమునందలి "భుజంగుల పాలౌ, ననుమాటయు దెల్పుచున్నవి. రసికుఁడగు శ్రీనాథుని యభిలాషమేమయ్యెనో?

"కవిసార్వభౌమఁ"డని సార్థకబిరుదము గాంచిన శ్రీనాథుని కవిత్వముఁ గూర్చి నేనిక్కడ కేలుగాఁ జర్చింపవలసిన యవసరము లేదు. అయినఁ గవి దీని నెట్టి వయసున వ్రాసినాఁడో యాలోచింపవలసియున్నది. ఈతఁడు యౌవన దశను స్త్రీలోలుఁడై విచ్చలవిడి దిరిగెనని చెప్పుదురు. ఆకాలముననే వీధినాటకమునందలి పద్యములఁ జెప్పెననియు వాడుక, రసికాభిలాషముకూడ నప్పటిదే యయినచో నది మానాఁగు మీసాల నూత్న యౌవనమున"నే విరచింపఁబడియుండును అయిన నొక్క బాధకమున్నది. 8వ పద్యమునఁ "కవిసార్వభౌముని" పదము వాడఁబడి యున్నది ఈబిరుదము శృంగారనైషధము వ్రాసిన వెనకనే యీతనికి రాయలయొద్దఁ బాదుకొల్ప బడినట్లువిందుము. ఈపద్యము తరువాతఁ గలుపఁబడినదేమో!

రసికాభిలాషమున శ్రీనాథుడు తెచ్చిన కల్పనలను గొన్నిటిని జూళ్వకవులలోఁ గొందఱటీవల నుపయోగించిరి, అందుచేత వారిలోఁ గొందఱియొద్దనైన నీగ్రంథముండెనని తోఁచుచున్నది. ఎందఱు శ్రీనాథుని కల్పనల దొంగలించిరో, యొందఱికిఁ గ్రొత్తగా నాతని యూహాలే తట్టినవో చక్కఁగఁ నిర్ణయించుటకు వానినిక్కడఁ జూపించుచున్నాను.

1 కూచిమంచి తిమ్మకవిని నడివీథిలోఁ గౌగలించిన వృద్ధవేశ్య

"చ. చతురులలోన నెంతయును, జాణ వటంచును నేమ కౌగలిం
చితి, నిటుమాటుమో మిడఁగఁ జెల్లునె రోరసికావతంస!"

యన్నప్పుడు "అ
ద్భుత మగునట్టి బంగరపు, బొంగరపుంగవఁ బోలు నీకుచ
ద్వితయము బొమ్మనాటి యుల, కెఁపున దూసెనటంచుఁజూచితిన్"

అన్న ప్రతివచనముయొక్క సమయస్ఫూర్తి నెంతముగదా! ఇందలి 29 వ పద్యముఁ జూడుడు.

2 తాను బ్రక్కనుజేరగా మొగముఁ ద్రిప్పి పన్నుండిన వేశ్యఁగూర్చి తామలింగఁడన్న

"మ. కరబింబాధరముం బయోధరములుం, న్వస్త్రాళికంబు ల్కనో
హరలోలాక్షులు చూప కవ్వలి మొగం, బైనంత నే మాయె? నీ
గురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు మాకుం జాలవే? ఁగంక
ద్దరి మే లిద్దరిఁ గీడు నుంగలదే?, యుద్యద్రాజబింబాననా!"

అను పద్యమునందలి భావము దీనిలోని 40 వ పద్యములోనిదే, ఇందు "సౌందర్యఁ గంగాఝరి, యని చెప్పి యందుల కనుగుణ్యముగా భావమంతయు నడుపుట విశేషము.

iii "సీ. బింబోష్ఠియని నీవు, పెనఁగ రాదు కుశంబ!
సాంకవగంధి యీపంకజాక్షి"

యను రసికజనమనోభిరామమునందలి పద్యము చాలకలందలి 8 వ పద్యమును బోలును.

iv రంభాద్యప్సరస కాంతలనామములు తారాశశాంకాది ప్రబంధములఁ శ్లేషింపఁ బడుటకుఁ బూర్వమే యిందలి 46 వ పద్యమున నట్లుపయోగింపఁ బడినవి

v మనుచరిత్రలోని "మీటినయంత నిచ్చ చనుమట్టు" లను మాటయు విజయవిలాసములోని "మీటిన నిచ్చ చనుదోయి" యనుమాటయు గ్రొత్తది కావని యిందలి 6వ, పద్యము తెలుపును.

vi. ఆలాగున నే "జగతి వెంకటి యుపకారి కంబరారి' యన్న విజయవిలాస పద్యభాగము దీనిలోని 11వ పద్యముననున్న "యుపకారితగుంగద కంబరారి" యనుదానిని జూచి వ్రాయఁబడినదా యనిపించును,

నాకు లభించిన ప్రతి మిగులఁ బ్రాఁతదైనందునఁ గొన్నియెడలఁ జినిఁగి పోయినది అట్టిచోటులఁ బోయిన మాటలను నేనే పూరించితిని. అట్లుకలుపఁ బడిన భాగము లేవో శ్రీనాథవిరచితభాగము లేవో శైలులవలన దెలియుట సులభముగాన వానిని వేఱువేఱుగా జూపలేదు.

దీని ప్రతి మఱియెవ్వరియొద్దనైన నున్నచో నాకు బంపినయెడల రెండవ కూర్పునందైన నిందలి లోపముల సవరింతును.

విశాఖపట్టణము. పెట్టి లక్ష్మీనరసింహము బి. ఎ.
1 . ఆగష్టు 1905 రుక్మిణీకల్యాణ నాటకగ్రంథకర్త.
మిస్సెస్సేవియన్ కాలేజిలో నుపాధ్యాయుడు.

# మనోరమ

ఆగష్టు నెల 1907 రాజమహేంద్రవరము

## కృతివిమర్శనము

రసికాభిలాషము — ఇది యొక్కటే యాశ్వాసముగల చిన్నప్రబంధము. ఈపుస్తకము విశాఖపట్టణనివాసులు రుక్మిణీకల్యాణ నాటకగ్రంథకర్తలు పట్టపరీక్షయందు కృతార్థులు నగు మ. రా. శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారిచేత నోరి గిన్నకోట అప్పలనరసయ్య శాస్త్రిగారి శారదాముకుర ముద్రాక్షరశాలలో ముద్రితమై ప్రకటింపబడియె. ఆ సెట్టి లక్ష్మీనరసింహముగారు కడచిన వేసంగి సెలవులలో బంధువులయింట వివాహము నిమిత్తము సింహాచలపు టడివారమునకు పోయి యుండగా నక్కడ నొక శ్రీవైష్ణవుని గృహములో నీపుస్తకము వారికి లభించినదట. ఈగ్రంథము శ్రీనాథుని వీధినాటకముతో గలసి యొక్క తాటియాకు పుస్తకముమీద వ్రాయబడి యుండుటచేతను గ్రంథాంతమున చక్రబంధ పద్యమునందు శృంగార శ్రీనాథ యనునామము కనంబడుటచేతను కవిత్వము కల్పనలు రసవంతముగ నుండుటచేతను గద్యములేకపోయినను శృంగార నైషధము, కాశీఖండము, భీమఖండము, హరవిలాసము రచియించిన మహాకవి శ్రీనాథుడే దీని రచియించెనని లక్ష్మీనరసింహముగారు పీఠికలో సిద్ధాంతముచేసిరి కాని యా సిద్ధాంతము మాకంత యుక్తియుక్తముగ గనుపడలేదు.

మేమెన్నిసారులు వారి కిచ్చిన మూలగ్రంథమును శ్రద్ధతో జదివినను శ్రీనాథుం డీగ్రంథమును రచియించియుండెననియు విషయాసక్తుడయి పడుచు తనవు గర్వముచేతి నోడ తెలుగక తిరుగు ధూర్తవిటు డెవండో తనదు పాండిత్యము జూపయు పద్యముల నల్లియుండవచ్చుననియు మాకుం దోచుచున్నది. ఇట్లు మాకుందోచుటకు గల కారణములలో గొన్నింటి నీక్రింద నుదాహరించుచున్నారము. గ్రంథాంతమునందు గద్యముగాని గ్రంథారంభమునందు కవివంశాదులు కాని లేవుగదా? అందుచేత ఎవ నూహించిచేసి కవిపేరు కనుగొనవలయునను టస్పష్టము. చివర చక్రబంధములో చేర్చడు శృంగార శ్రీనాథ పదముల చేత శ్రీనాథుడే గ్రంథకర్తయని యన నూహింపదగదా? అట్లూహింప వీలులేదు. శ్రీనాథునకు శృంగార శ్రీనాథుడని యెక్కడను బ్రసిద్ధిలేదు. శృంగారమువారు శృంగారకవివారు తెలుగు దేశమందు వైష్ణవులలోను నద్వైతులలోను ననేకులున్నారు. వారిలో నెవరయిన శ్రీనాథనామము గలవాడొకడుండవచ్చును. అతడే తనకవిత్వము ప్రశస్తముగా బయటికి వెల్లడించి

యుండవచ్చును. అంతియే కాని కమలనాభామాత్య పౌత్రుడు, మారయామాత్య పుత్రుడు నగు మహాకవి శ్రీనాథుఁ డీ గ్రంథకర్త కాఁడు, అదిగాక శ్రీనాథుని గ్రంథము లన్నిటియందే తన లక్షణగ్రంథమునకు లక్ష్యపద్యములను దీసికొనిన యప్పకవి గాని కూచిమంచి తిమ్మనామాత్యుఁడు గాని యడిదము సూరకవి గాని మఱి యితరలాక్షణికు లెవ్వరు గాని యీ గ్రంథము పేరయినఁ దల పెట్టకుండుటకుఁ గారణ మేమి? ప్రాచీన మహాకవుల కెవ్వరికిం దెలియని యీ గ్రంథము నేఁడు క్రొత్తగా శ్రీనాథునిదని యొకరు చెప్పినంతమాత్రమున జను లొప్పుకొన వచ్చునా?

ఆ కారణముల నటుండనిచ్చి యిందు ప్రస్తావింపఁబడిన యంశమును విచారింతము, ఒక రసికుడు వివాహితయయి భర్తతోఁ గాపురము చేయుచున్న యొక కులకాంతను మోహించి నఖశిఖపర్యంతము నామె సకలావయవముల వర్ణించి యామెతో గూడినట్లు స్వప్నములఁ గాంచి యా స్వప్నములఁ దలఁచుకొనుచు విరహతాపము నొందుచు నామె చక్కఁదనమును దలంచి యూటలూరుచుండుటయే యిందలి కథాంశము. పరకాంత, కన్యయైనఁ గాదు వేఱొకని భార్యయగు దానిని దలఁచి, వలచినందులకు సిగ్గువదలి పైపెచ్చు బూతుపద్యముల వ్రాసి శ్రీనాథుఁడు విరహతాపము పొందెనని చెప్పుట పరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడు నగు శ్రీనాథుని కీర్తి పాడుచేయుట, శ్రీనాథునకే గాదు, ఈ పద్యములు తనవని యెవఁడు చెప్పుకొనునో వాని కప్రతిష్ఠయే గాని ప్రతిష్ఠ కాదు, అందుచేతనే కవి గ్రంథమునందు మొదటనైన చివరనైన తనపేరు విస్పష్టముగ వేసికొనుటకు సిగ్గుపడియెను. మఱియుఁ జక్రబంధమునందున్న శృంగార శ్రీనాథపదములు కేవల మొక పురుష నామమును దెలియఁజేయవు. శృంగార శ్రీయనగా శృంగారలక్ష్మి. దానికి నాథుఁడు శృంగార శ్రీనాథుఁడు. గ్రంథము దుర్నీతి బోధకమగుటచేతనో మఱియొండుచేతనో కవి గద్య వేసికొనుట మానినప్పుడు తనపేరు కేవిధముగాఁ దెలియఁజేసికొనుట కిష్టపడును? ఇష్టపడకపోవుటచేతనే తానొక శృంగారనాయకుఁడ నను మానము మాత్రము సూచించెను. అంతేత నది యొక మనుష్యుని పేరుగా గ్రహించుటకు వీలులేదు. శ్రీనాథునకుఁ గవిసార్వభౌమ బిరుద మున్నదనియు నా పదమిందుఁ బ్రయోగింపఁబడుటచే నతఁడే దీనిని రచియించెననియుఁ బీఠికలో వ్రాయబడినది. కవిసార్వభౌమ బిరుదము పేరునకు గలదు. కూచిమంచి తిమ్మనామాత్యునకు లేదా? ప్రతికవియు నాలుగుపద్యము లల్లినతోడనే తాను కవీశ్వరుఁడ ననియుఁ గవిసార్వభౌముఁడ ననియు పుస్తకములలో ప్రయోగించుకొనుచుండును. కావున కర్తృత్వము శ్రీనాథున కారోపించుట కదియొక కారణముగాదు.

ఇందు పద్యముల శైలియుఁ గవిత్వచాతుర్యము నించుక శోధించిచూతము, కల్పన లెక్కఁడనోగాని తరచుగాఁ బ్రౌఢముగా లేవు శైలియు శ్రీనాథుని శైలితో

కొంతమాత్రము గోలరు. శ్రీనాథుని గడుసుతనపు పోకడ లిందెక్కడను గాన రావు, అదియునుంగాక యీగ్రంథ మాతనిదే యెవ్వఁడో రచియించెనని స్పష్ట ముగ చెప్పుటకు తగిన యుదాహరణములు కొన్ని కానఁబడుచున్నవి. పదునేనవ పద్యమునందు "తయారు గోరు తను" అను పదమున్నది. తయారన్నది తురక మాట గాని తెలుఁగుమాట కాదు. ప్రాచీనకవు లెవ్వరును ముఖ్యముగ శ్రీనాథుఁ డిట్టి పదము ప్రయోగించినట్లులేదు ఇట్లే నలుబదిమూడవ పద్యమున 'ఖయిదు బాహుపాశములఁ గట్టవే, అని యున్నది. ఇదియును శ్రీనాథాది ప్రాచీనులు ప్రయోగింపని హిందూస్థానీ పదమే. పంతొమ్మిదవ పద్యమునందు 'నాకుంగూడ నాభాగ్యమెట్టుల నేనాటికి గల్గునో యని యున్నది, నాకుంగూడ, ఇట్టి ప్రయోగము లాధునికుల గ్రంథములలోనే గాని ప్రాచీనుల గ్రంథమునందుఁ గానఁబడవు ఇందు 'గూడ' యను పదము సముచ్చయార్థమగు 'ను', వర్ణకమునకు బదులుగ నాధునికులు ప్రయోగించుచున్నారు ముప్పదినాలుగవ పద్యమునం దొక లజ్జిలివానఁట యని యున్నగి, లజ్జిలినాఁడ నని యుండవలయును గాని నాను యని యుండుట యసాధువు ఇట్లు శ్రీనాథుఁడు ప్రయోగింపఁడు. ఈపుస్తకము నందలి నూఁబది పద్యములలో నిట్టి వింతలు కొన్ని యున్నవి గ్రంథవిస్తరణభీతిచేత నిచట నుదాహరింపక యుంటిమి, పూర్వోదాహృతము అయిన ప్రయోగములంబట్టి చూడ నీగ్రంథ మెవఁడో నవీనుఁడు రచించి యుండవచ్చుఁగాని శ్రీనాథాదులగు ప్రాచీను లెవ్వరును రచించి యుండరనిసుయుక్తము తోఁచుచున్నది పెట్టి లక్ష్మీనరసింహముగారు వ్రాసినపీఠికలో శృంగార మన్న విప్రపాయముగఁ జూడవలయునని చెప్పు నిప్పటి యాంధ్రులకు శృంగార భూయిష్ఠమగు పుస్తకము రుచింపమి విదితమే యని యొకచోటను, దీనిని నవీనకవియే యొకఁడు రచియించి ప్రచురించిననో విమర్శకు లెల్ల దూషించియుందురో దేవునికే తెలియునని వేరొకచోటను వ్రాసిరి. ఈనాటి యాంధ్రులలో నెవ్వరు శృంగారమన్న విప్రాయముగఁ జూచుచున్నారు- శృంగారము పేరుపెట్టి యిచ్చవచ్చినపచ్చిబూతులు వ్రాసినవారి కబ్బములనీనాటి వారు విప్రాయముగఁ జూచుచున్న మాటనిశ్చయమే శృంగారరసమునకు నాగరికులు జనుల సిగ్గుపడు మర్యాదదప్పిన వాక్యములకు భేదము తెలిసికొనలేక యీలక్ష్మీనరసింహము గారిట్టి వెఱ్ఱివ్రాతలు వ్రాసినందుకు మేము తద్దయు విచారించుచున్నారము - కాళిదాసాదులగు సంస్కృతకవులు కవిత్రయమువారు పింగళి సూరన మొదలగు తెలుఁగుకవులు శృంగారరసమువర్ణింపలేదా? ఆశృంగార రసము నీనాటి యాంధ్రులాదరించుట లేదా? పురుషులైనను చదివి తలవంచుకొనవలసిన బండబూతులుగల పద్యము గాని రసము శృంగారరసము గానేరదు- ఇట్టి గ్రంథముల నాదరించుట నాంధ్రసూరులో విమర్శకులు లెంచుచు, ప్రాచీనులు రచియించి

# ప్రతివిమర్శనము



రసికాభిలాషము — (శ్రీ) మనోరమాపత్రిక 1907 సం॥రం ఆగష్టునెల సంచికలో ప్రబంధమునుగూర్చి వ్రాయఁబడినవిమర్శనమందు శృంగారనైషధాదుల రచియించిన మహాకవి శ్రీనాథుఁడీరసికాభిలాషము రచియింపలేదని వాదింపఁబడినది. అందులకీఁబడిన హేతువు లెంతయుక్తియుక్తములో యీదిగువ విమర్శింప బడుచున్నది.

‡ చివర చక్రబంధములో శృంగారశ్రీనాథవాక్కు మేర్పడుచున్నను మారయామాత్య పుత్రుఁడగు శ్రీనాథునికి శృంగారనాథుఁ డనుప్రసిద్ధిలేదు గనుక నీతఁడు వేఱుకవి యఁట! చక్రబంధములో నారక్షరముల నామమే యిమడ్చ వలయునుగాని యంతకంటె నెక్కువగాఁ గాని తక్కువగాఁ గాని వలను పడదనుట బంధకవిత్వము చేయువారికందఱకుఁ దెలిసినవిషయమే కావున శ్రీనాథపదమునకు ముందు మూఁడక్షరము లం చేర్పఁబడవలయును. నైషధమునకు శృంగార నైషధమని పేరుపెట్టియుండుటచే శ్రీనాథునికి శృంగారపదముమిగుల నభిమానమైనదని స్పష్టముగదా! అదిగాక తానువ్రాయుచున్నది శృంగారభూయిష్టము తానొకప్రసిద్ధుఁడగు శృంగార నాయకుఁడు. అందుచేత "శృంగారశ్రీనాథ" మని వాడియుండఁగూడదా? తక్కిన కారణముల వలన శృంగార నైషధ గ్రంథకర్తయే రసికాభిలాష గ్రంథకర్త యని తేలుచున్నయెడల శృంగారశబ్దమున్నదన్న హేతువుచేతనే యనుమానించుట కూడునా? శృంగార శ్రీనాథపదమునకు శృంగార శ్రీనాథుఁడు. శృంగారనాయకుఁ డని యర్థము స్ఫురించుచున్నదని విమర్శనమందు సెలవీఁబడినది. అట్లుతన నామమును శ్లేషించుటయే శ్రీనాథుని యభిప్రాయమేమో అట్లయి యుండుననియే శ్రీనాథప్రణీతము మాత్రమే యని కాక ముఖపత్రము మీఁద శృంగారశ్రీనాథప్రణీత మని యచ్చొత్తింపబడినది. అదివిమర్శకులు తిలకించిరా? కారణమేమని యూహించిరి లేక తెనుఁగుదేశము లోని శృంగారమువారు శృంగారకవివారు మొదలగునింటి పేరులవారిని వైష్ణవుల యందు నద్వైతులయందు వెదకుచుఁ గూరుచుండినందున వీరికి ముఖపత్రము జూచుటకు సావకాశము లేకపోయెనా? ప్రౌఢకవి మల్లన్న యన్న పేరు విన్నయెడల వీరిట్లే ప్రౌఢమువారుప్రౌఢకవివారు శైవులయందు ద్వైతులయందుఁ దెలుగు దేశమునందుఁ గానవచ్చుచున్నారని వ్రాయుదురేమో!

‡‡ కవిసార్వభౌము విరచితము రసికాభిలాషమున బ్రయోగింప బడినను శ్రీనాథుఁడిది రచించెనని తెలియఁ జేయుదటు మీఁది పద్యమునకే శ్రీనాథపదము

సహితము ప్రయోగింపఁ బడినదె ఈరెండును గలసి యాలోచించినచో, నీగ్రంథము శ్రీనాథుని దన్న యూహామరింత బలముగా నా! ఆసంగతిగూర్చి విమర్శకు లెల్ల సన్న సన్నగా నూరకుండిరి! తమవాదమునకు విరుద్ధముగా నుండువానిని విడుచుటయా విమర్శకలక్షణము! కవిసార్వభౌమబిరుదము మనేకులకుఁ గలదట! శ్రీనాథునికిని గూచిమంచి తిమ్మకవికిని గాక యితరుల కెవ్వరి కున్నదో విమర్శకులు సెలవిచ్చిన విందము. కవిసార్వభౌమబిరుదమును శ్రీనాథనామమును గలిసి ప్రయోగింపఁ బడుటచే మనము కూచిమంచి తిమ్మనను విడిచి శ్రీనాథుని నే తీసికొనవలసి వచ్చుఁగదా? ప్రతికవియు నాలుగుపద్యము లల్లినతోడనే తాను కవిసార్వభౌముఁడనని పుస్తకములలోఁ బ్రయోగించుకొనుచుండునట? ఈవిమర్శకులు నాలుగుపద్యములు అల్లియుండి రేమో? కవిసార్వభౌముల మని పుస్తకములలోఁ బ్రయోగించుకొనిరా! పోనిండు. విమర్శక సార్వభౌములమని యైనఁ జెప్పికొందురా? వారు గాక పోయిన,నట్లు ప్రయోగించుకొనిన వారిపేరులు కొన్ని సెలవిచ్చెదరా! వాగనుశాసన ప్రబంధ పరమేశ్వరాంధ్ర కవితాపితామహాది బిరుదములుగూడ నాలాగునే యితరుల నుపయోగింపఁబడెనా! మరియొకటి గ్రంథము దుర్నీతిబోధకమగుటచేతనో మరియొండుచేతనో కవి గద్య వేసికొనుట మానినందున మరియేవిధముగాఁ గూడ దత్కర్తృత్వమును దెలియఁజేయుట కిష్టపడి యుండడని వీరి నిర్ధారణ చేయుచున్నారు కవి గద్య వేసికొనుట మానెనని యెవ్వరికిఁ దెలియును? ఇప్పుడు లభించిన ప్రతిని వ్రాసికొనినవారు గద్య విడిచిపెట్టి యుండవచ్చును. గద్యవేసికొనలేదు పో, రసికాభిలాషము గద్యయవసర మున్నంత పెద్దగ్రంథము? వీధినాటకమునకుఁ గవియేగద్యవేసికొనెను! దుర్నీతిబోధక మని మానెనన్నచో, గూచిమంచి జగ్గకవి తన చంద్రరేఖా విలాపము దుర్నీతిబోధక మనియే కాబోలు దానియందుఁ గద్యవేసికొనెను.

iii. శ్రీనాథుని గ్రంథము లన్నిటినుండి తమలక్షణ గ్రంథములకు లక్ష్యపద్యములఁ దీసికొనిన యప్పకవి మొదలగు లాక్షణికులు రసికాభిలాషము నేగనుఁ దలపెట్ట కుండుటకుఁ గారణమేమని విమర్శకులు ప్రశ్నవేయుచున్నారు. వీరటు లొకను మూలమును శ్రద్ధతో నెన్నియో మారులు చదివిరట! అవును. గ్రుడ్డిపాఠము డెబ్బదిపదునొకండు మారులు చదివినను దెలివిలేని విద్యార్థికిది యెట్లు పనికివచ్చును" శ్రీనాథుని వీధినాటకము లోకమునఁ బ్రచురమయ్యు నీరసికాభిలాషము కానందులకు గారణము లేకపోలేదు. ఇందుఁ గవి యుద్దేశించిన నాయిక గొప్పరాజుల యింటిదగుట నిశ్చయ" మని వీరికిలో స్పష్టముగాఁ దెలుపబడి యుండగా. వీరి కళంకకంక నవకాశమేది? అదియేల వీరుచూడరైరి! చూచినచో నేల ఖండింపరైరి! వ్రాసినది తిప్పఁగాఁజాలని యగ్గము చేసికొనగలశక్తి వచ్చినవెనుకనే విమర్శనముల నాకాంక్షించుట మంచిదేమో పోనిండు కారణము చెప్పబడలేదే యనుకొందము

అయినను దశలక్షణ గ్రంథముల చెప్పకవ్యాదులు పద్యము నుదాహరింప మానినంతనే పూర్వగ్రంథముల గూర్చియును మానము పడుటకూడునా! మరుద్రాజ చరిత్ర, పండితా రాధ్యచరిత్ర, శాలివాహన సప్తశతి, పల్నాటివీర చరిత్ర, యనుగ్రంథములనుండి మాత్రము నాయుదాహరణముల గైకొనిరా? ఆమాత్రముచేతనని శ్రీనాథునివి కావనుచున్నారా? భోజరాజీయము, విజ్ఞానేశ్వరీయము, మార్కండేయపురాణము, ప్రబోధచంద్రోదయము, కువలయాశ్వచరిత్రము, భానుమతిపరిణయము మొదలగు కొన్నిగ్రంథముల నుండి యప్పకవి మొదలగువారి పద్యము లుదాహరించుట మానలేదా? లాక్షణికులు తమకవసరమైన లక్ష్యముల బూర్వప్రబంధము లన్నింటినుండియు దీసికొన కలయునా?

శైలి శ్రీనాథుని శైలితో కొంతమాత్రమును బోలదట! శ్రీనాథుని యేశైలితో బోలదు? వీథినాటకమందలి శైలితోడనా? శృంగారనైషధమందలి శైలితోడనా, హరవిలాసమునందలి శైలితోడనా? ఒక్కకవియే వేరువేరు ప్రాయము లప్పుడు వ్రాసినయెడల కవిత్వమునకు వేరువేరు శైలులు వచ్చును. కవిబ్రహ్మయను పేరుతనకు వచ్చుటకు దగినట్లుగా భారతభాగము నాంధ్రీకరించిన తిక్కయజ్వ సోమయాజి కాకపూర్వము రచించిన నిర్వచనోత్తర రామాయణమునుజూచిన, నది యాతనిదా యనుపించును. కవి రాజమనోరంజనము పిల్లలవసుచరిత్రమని పేరు వచ్చునంత ప్రౌఢముగా రచియించిన కనుపర్తి సుబ్బన్న చిన్నతనమునందు వ్రాసిన యనిరుద్ధ చరిత్రమును జూచిన, నదియాతనిదా యనుపించును, చాటుకూర మంచి ... కమునఁబడినదని మెప్పుడు గాంచునట్లు విజయవిలాసమును విరచించిన వెంకటకవి యంతకు పూర్వముచేసిన సారంగధరచరిత్రి చూచిన, నది యాతనిదాయనుపించును ఈసంగతులను మనస్సునందుంచుకొని యుండినచో విమర్శకులు శైలిపోలదని వ్రాసియుండరు. రసికాభిలాషము శృంగార నైషధాదులవలె సంస్కృత భూయిష్టము కాదు గాని కొంతవరకు వీథినాటకకవిత్వమును బోలుచున్నదనవచ్చును, వీథినాటకము వ్రాసినవయస్సునకును భిన్నమైన ప్రాయమున వ్రాయబడి యుండినచో వీథినాటకశైలికంటెఁ గూడ దీనిశైలి భిన్నమైయుండవచ్చును. శ్రీనాథుని గడుసుఁదనపుఁబోకడ లిందెక్కడ గానరావట! శ్రీనాథుని గడుసుఁదనపుఁబోకడల కేమిగాని నైషధాదులయందున్న గడుసుఁదనపుఁ బోకడలేవో రసికాభిలాషమునందు లేనివో దృష్టాంతములతోఁ జూపి, తమవాదము హేతువులతో సిద్ధాంతీకరించుకొనక నట్టిమాటలమాత్రముచేత గాలక్షేపము చేసిన యావిమర్శకుల గడుసుఁదనపుఁబోకడను మాత్రమెంతైనను మెచ్చవచ్చును. ఆలాగుననే కల్పన యెక్కడో కానితరుచుగాఁ బ్రౌఢముగా లేదని ... కరుమాటుమాత్రముచేతనే స్థాపింప జూచుచున్నారు! ...కాదన్నవాఁడు కరణం, మన్నట్లు వ్రాసిన

యీ యాత్రికులవలనఁ బ్రయోజనమేమి? రసికాభిరామము శ్రీనాథునిదని హేతువులతోఁ జెప్పినను అనలోప్పుకొనఁ గూడదట! కాని యీవిమర్శకులేమి చెప్పినను. చెప్పినంత మాత్రముననే యొప్పుకొన వలయునుగాబోలు! 1. 2. 26. 27. 50 పద్యములు దప్ప రసికాభిరామమునందు గల్పనలులేనిపద్యములు వీరు మరియొన్ని సారులు మూలములు చదివియైనను జూపగలరా? వానిలోని కల్పనలు మాత్రమే ప్రౌఢముగా నున్నవని వీరియభిప్రాయమో, లక్కన నేలకావో కారణసహితముగా వీరు నిరూపించి నగదా తిరిగి యేమి చెప్పుటకైన వీలుండును!

5. రసికాభిరామమునందు శ్రీనాథుడు ప్రయోగించి యుండనియాధునిక ప్రయోగము లున్నవట! ఈసంగతి పోల్చుకొనుట కుపయోగించిన కుశాగ్రబుద్ధినిమరి కొంత యుపయోగించి వీరు పైసంగతి కూడ గ్రహింపలేకపోవుట చిత్రముగా నున్నది శిథిలములైన స్థలముల క్రొత్తగా బూరింప బడిన భాగములు కుండలీకరింప వలసినయవసరము లేకుండ సులభముగా బోల్చుకొనగలుగుట కచ్చోటుల నెల్ల నీలైనవరకు నాధునికప్రయోగములే చేయబడియుండగా "మాబుద్ధికి నీ గ్రంథమంతయు నొక్కశైలియే కనబడుచున్నది కాని వేర్వేరు శైలులు కనబడుటలేదు" అని వీరువ్రాసిన నదియంతవిశ్వాస్యాస్పదముగా నున్నదో చూడుడు. ఆధునిక ప్రయోగముల మూలమున గలుటచే శ్రీనాథునిగ్రంథము కాదని స్థాపింపఁగలిగితి మని వీరుసంతోషింతురే కాని క్రొత్తగ బూరింపఁ బడినభాగము లున్ననే, యీ నవీనప్రయోగము లందలి వేమో యనుసంశయము కూడ వీరు పొందరైరే. పాపము, తమయుక్తి యప్రతిహత మనుకొనిన వీరయూహ్నామునకు భంగము కలిగినందులకు విచారింప వలసినదే "లజిలినాను" అనునది కేవలము సాధు వని వ్రాయుచున్నారు. "ఉన్నాడను, అనుదానికి "ఉన్నాను,, అనునది రూపాంతర మయినట్లే ,, లజ్జిలినాడను, అను దానికి, లజ్జిలినాను" అను రూపాంతర మువట్లు మనాంతరము గలదు. ఆధునిక ప్రయోగములు గలవు. కావున నచో మనోరమాపత్రికాధిపతులచే రచింపబడి మనోరమయందు ప్రకటింపబడిన ప్రసన్నయాదవనాటకమున 11 వ పుట చూడుడు. అందు "బ్రతికినాను" అనురూపము ప్రయోగింప బడినది. ఇది పాదుకైన నసాము కైన ప్రకృతాంశమున కొక్కటియే శ్రీనాథు డిట్లు ప్రయోగించియుండ డన్నదానితో నిర్వివాదముగ నేకీభవింప వచ్చును విమర్శకులు కష్టపడి యుదాహరించిన ప్రయోగములం బట్టి చూడ, శిగ్రంథమునందు క్రొత్తగా బూరింపబడిన భాగములే నవీనుడు రచించినట్లు తోచును కాని గ్రంథమెల్లను శ్రీనాథాదులగు ప్రాచీను లెవ్వరయిన వ్రాసి యుందురని తోచవలసిన యవసరములేదు.

6. శ్రీనాథుడు పరమభాగవతోత్తముడట. నైష్ఠికుడట ఇట్టిగ్రంథమును వ్రాసియుండ డట యాత్రకొరకు వచ్చెడి సకలజాతుల నాతులను

గూర్చి వర్ణించుటకై నేమి, సింహాచలము వంటిపుణ్యశైలముమీఁద సంకేతమును గూర్చుండినమహానుభావుఁడు పరమభాగవతోత్తముఁ డనవలసినదే. నీళ్ళరేవులకువచ్చెడి మంగలి, చాకలి, తెలికలపడుచులను పంయుతము కలపిననేమి, వారిచేత శ్రీకాళీశేశ్వరీవరణములపై నొట్టు వేయించుకొనిన ధర్మాత్ముఁడు నైష్ఠికుఁడనవలసినదే. “ ఈతఁడు యౌవనదశయందు శృంగారనాయకుఁడై స్త్రీలోలుఁడైతిరిగె నని యొకచోటను, , అవసానదశయం దిట్టి కష్టముల నెల్లను గారణము యౌవనదశయందుఁ గామకళను నేక స్వేచ్ఛగా విహరించి దేహమును ధనమును బోఁగొట్టుకున్న పాపఫలము తక్క వేఱొకటి కావరా” దని వఱియొకచోటను గవిచరిత్రయందు వ్రాసిన రావుబహద్దరు వీరేశలింగంపంతులుగారి విమర్శకుల పాటియెుఱుఁగరు కాఁబోలు! ” విధివిరామము లేక వేశ్యాకాంతలఁ వేరాధరసుధారసధారలఁ గ్రోలు ,, చుండినను గాళహస్తీశ్వర మహాత్మ్య గ్రంథకర్తయగు ధూర్జటి మాత్రము పరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడును గాఁడా? లేక, “ ప్రమత్తునిం గావఁడవంగరాదు వెలుచం బరకాంతలఁ గూడెనేనియు,, నని విమర్శకుల యుద్దేశమా? శ్రీనాథుని సార్వప్రసిద్ధి యసిద్ధమైనదని విమర్శకులు లేనిపైనఁ గారణములఁజూపి పరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడు ననిన బాగుగానుండును. రసికాభిలాషము వ్రాయుసరికి శ్రీనాథుఁడు శృంగారనాయకుఁ డనుట స్పష్టము. శృంగారనాయకుఁడనని తెలియఁ జేసికొనుటకే తననామమును శ్లేషించుచు శృంగారశ్రీనాథపదము నుపయోగించియుండును. రసికాభిలాషము శ్రీనాథునదని చెప్పుటవలన నాతని కీర్తి పాడగునేమోయని విమర్శకులు జడియ నవసరములేదు. వీధినాటక మాతనిదని చెప్పుటవలనకంటె నిప్పు డెక్కువగా నాతనికీర్తి పాడు కాదు. రసికాభిలాషమునఁబూతు విస్తారముగా నున్నదని శ్రీనాథుఁడా గ్రంథమతనదని తెలియఁజేసికొనుటకు సిగ్గుపడెననుట యాలోచనలేని వ్రాత. ఈమాత్రపుశృంగారపద్యములనతఁడు తక్కినగ్రంథములలో వ్రాసియేయున్నాఁడు. వీధినాటకములోనివని యప్పకవి యుదాహరించిన “కుసుమంబద్దిన చిరకొంగు,, “ కంఠమె కేళిసల్పెడు ప్రకారమునన్,, మొదలగు పద్యములం బూతు లేదివా అవి కమలనాభామాత్య పౌత్రుఁడు మారయామాత్య పుత్రుఁడు నగు మహాకవి! శ్రీనాథుఁడు రచించినవే కా నా! ఒక్క శ్రీనాథుఁడే యన్న మాటయేమి? శృంగా గూడు శ్రీనాథకవి,, యని వ్రాసిన శతావధాని తిరుపతి వేంకటేశ్వరకవుల కీమాత్రము తెలిసినది కాదు కాఁబోలు. వయసు ముదిరి తరువాత గ్రంథములలో వ్రాసిన శ్రీరంగనీతులు వృద్ధనారీపాతివ్రత్యమును సూచించునని యెఱుఁగక వీరెట్టి విచిత్రవ్రాతలు వ్రాసిరి. కాశిఖండ భీమఖండ గ్రంథకర్తయగుట మాత్రముచేతనే శ్రీనాథుఁడు సతతమును బరమభాగవతోత్తముఁడును నైష్ఠికుఁడు నయ్యెనవో, “భువనైక మోహనోద్ధతి సుకుమారవారవనితా జనతా ఘ న తా ప హా రి సం త త మ ధు రా ప్రబంధముల

వ్రాసిన సంస్కృతాంధ్ర కవులెల్లను నిప్పటిమనకు బూతుగా దోచు నీమాత్ర శృంగారమును వాడిమేయున్నారు విమర్శకులు గ్రంథపరి శోధన చాలకయో చదివినది మరచియో కాళిదాసాదులగు సంస్కృతకవులు కవిత్రయమువారు పింగళి సూరన్న మొదలగు తెలుగువారు శృంగారరసము రసికాభిలాషము కున్న దానికంటె దక్కువగా వ్రాసిరని చెప్పసాహసించిరి. ఆకుదాని నోటిలో సయితము నీగుబ్బల నుబ్బించిన నీయాన ప్రాద్యుమ్నము నే విందించుకొను మన్నమాటలు బెట్టిన కాళిదాసుని శృంగారము వీరికి రుచించినది. పురాణకవులగు కవిత్రయము వారిమాటకేమిగాని ప్రభావతి ప్రద్యుమ్నుల సమాగమము మొదలుకొని వారిరత్యాదులను విజృంభించి వర్ణించిన పింగళి సూరన్న శృంగారము వీరికి రుచించినది స్త్రీవర్ణనము నఖశిఖపర్యంతము నొక్కయవ యవమేని విడువకుండజేసి రతివర్ణనము సయితము మానని తక్కిన శృంగారప్రబంధ కవుల శృంగారమెల్ల వీరికిరుచించినది కాని యేహేతువు చేతనో పాప మీరసికాభిలాషము సంగతి శృంగార మన్నమాత్రము వీరికివదల కంటగించినది పేరు పెట్టుట యెందులకు గాని నవీనులలో సంఘ సంస్కర్తలైనవారు సహితముచేసిన శృంగార రసికాభిలాషము లోని దానికంటె దీసిపోదే! దాని నీవిమర్శకు లెంత యూదరింతురు? పూర్వోదాహృత కవుల గ్రంథములు సర్వకళాశాలాధికారులు పరీక్షలకు గూడనియమించు చున్నారే. విద్యార్థులు తలవంచుకొనియైన జదువనే చదువుచున్నారే శృంగారభూయిష్టములని తలపక వైజయంతీవిలాస విజయవిలాస ముఖప్రబంధముల నాగరిక పత్రికాధిపతులును ముద్రింపించి ప్రచురించు చున్నారే. అవినమకృష్ణముల గూడ నీవిమర్శకులేల యూర బెఱుకరు? శ్రీనాథునిదన్న హేతువుచేత రసికాభిలాషమును మూలనడగ ద్రొక్కక ప్రకటించుట యొక సాహసము కాదు కాని, యీవిమర్శకులకు దెలిసియు దెలియని విమర్శనము వ్రాయుట సాహసమే. వెనుకముందు లాలోచింపక తొందరపడి వ్రాసిన యీ విమర్శనమునుజూడగా నిది విమర్శనాశిక్షచేత కొదలెఱుంగక యున్నధూర్త విమర్శకుడెవ్వడో వ్రాసియుండవచ్చునని తోచు చున్నది. కవిత్వశైలిందెలుపుట కుదాహరింపవలసిన మృదుకరయిన పద్యములు రసికాభిలాషమున లేవట? వీరిక న్నిరోసారులు చదివినను లాభింపకుండుట కిది నిదర్శనము లాభించి యుండినయెడల 1. 2. 8. 10. 17. 26. 32. 45. వ పద్యము లుదాహరించిన నష్టములేదని తెలిసికొనక పోయియుండు వారే! అందు రెండుశైలితెలుపుటకు కీడుగున నుదాహరింప బడుచున్నవి.

శ్రీ ర స్తు

# ర సి కా భి లా ష ము

శ్రీ పుత్రసఖీసన్నిభ
రూపవతీ! మదవతీ! మఱుఁగు తనపూవుం
దూపులనా? నీవాలుం
జూపులనా? నన్నుఁ గొట్టెదు న్బాధింపన్?॥

సీ॥ కొదమతుమ్మెదచాలు • నదలించఁగం జాలు
కప్పుదోఁ దనరు నె • గ్రొప్పుతోడ,
వెన్నెలలం జల్లి • నిలపిల్లుజాబిల్లి
గోముతోఁ దనరు నె • మ్మోముతోడఁ
బదను వెట్టిన మరు • బాణమ్ముల న్మీఱు
నేపుతోఁ దనరు చా • ల్చూపుతోడఁ
దొగరు మెఱుఁగుఁ బండు • దొండపండును మించు
కావితోఁ దనరు కె • మ్మోవితోడ,
తే॥ సందెవేళను మేడపైఁ • జల్లగాలి
కొఱకు విహరించు నిన్ను గ • న్గొన్న యంత
నీవయిన కను దృష్టముగా • నిలిచియుండి
నాకు వశము గాకున్నది • నామనమ్ము॥ 2

ఉ॥ సుందరి! పంట నొక్కుటను • జొక్కపుమోవి సుధారసంబు, చే
తం దుడుకారఁ బట్టఁ బలి • తంపుఁజను ల్వొలియేన్గు కుంభముల్,
సందిటఁబట్టి నిల్పఁగను • సన్ననికౌ నల మిన్ను, గాన నీ
'వందనిమ్రానిపండు' వని • యాసను మానదు డెంద మయ్యయో!

చ॥ పిడికిటఁ బట్టనిట్టటులు • బిట్టుగ మిట్టిపడంగఁ జొచ్చని

దుడుకుఁజనుంగవం బలెనె - తుళ్ళుచునాహృదయంబు గూడనొ
క్కెడను నడంగ కున్నయది,-యియ్యెడ గుబ్బల నాదుఱొమ్ము నం
దడఁగఁగఁ బట్టి యుంచు, తగి - నట్టివె యాయ్యెవి జట్టు పట్టఁగన్॥

సీ॥ చెలువ! నీచక్కని - చెక్కిలి నొక్కి మ
క్కువ నేను నొక్కించు - కొనుట యెపుడొ?
రమణి! నీ మధురాధ - రమ్మును గొఱికి మ
క్కువ నేను గొఱికించు - కొనుట యెపుడొ?
కొమ్మ! నీ ఱొమ్మునా - ఱొమ్మునం గ్రుమ్మి మ
క్కువ నేను గ్రుమ్మించు - కొనుట యెపుడొ?
కాలతి! దీ నెమ్మను - గౌగిటం జేర్చి మ
క్కువ నేను జేర్పించు - కొనుట యెపుడొ?

ఆ॥ వె॥ తెలివ, నిన్ను రతులఁ - దేలిచి నేను దే
లించుకొనుట యెపుడొ? - లేమ, నేను
నీవు ననెడుభేద - మే విధంబున లేక
యుండఁ గలుగు జెప్పు - డౌక్కొ యింక?॥

ఉ॥ కాముఁడు మనస్థలిని -గల్గిన ధైర్యధనంబు నెల్లనో
కోమలి దొంగిలించి యిఱు - కుంజనుకొండలసందు నందుఁబొ
నీ మెయిఁబొఁతి పెట్టెనుగ-దే ననుఁ జూచుకొనంగ నీయు మా
సీమను, సంశయంపులుఁ - జేతులఁ గ్రుమ్మెద, గోళ్ళఁ ద్రవ్వెదన్

మ॥ "అహహా! నీ కచ మంగజాతగుణము, - స్నానంబు చంద్రప్రభ
స్మహితాళు ల్పవనాశ్వముం గెలిచె, 'న - న్నని నన్ను బాధింపనా
కుహనుఁ లూర్పని రిదె గిరీశనమవ ♦ ఓోజా, తమోవేణి! యో
యహిరోమావళి! ప్రోవరమ్మ, నినుఁజూ-మ్మా నెమ్మదిన్నమ్మితిన్॥

సీ॥ నీ కురు ల్నిమురనే - నేర్పు నంతకె హేమ
నాసి! తమ్మెద నన్ను - గాసి పెట్టు,

నీ పల్కుల న్వీన - నేర్చెదవ్కానె సంకు
మదగంధి, చిలుక న - న్చెదర - జేయు,
నీ గళస్వర మెన్న - నేర్చపర్యంపమె
రామ, కోయిలనన్ను - రా పొనర్చు
నీ నెన్నడలఁ జూడ - నేర్చెదాకఁనె ఘన
వేణి, రాయంచ న - న్వెతల ముంచు॥

ఆ॥ వె॥ మరునిరాజ్యమునకుఁ ♦ గరుణ న న్పట్టాభి
షిక్తఁ గాఁగ నీవు ♦ చేయువఱకె
మమునిబలఁగ మిట్టి ♦ మాడ్కిని సన్ను బా
ధించు చుండు నో ర ♦ తీ విలాస॥

చ॥ మదనుధనుర్గుణంబు ♦ మార్గణపాళి పయి ఝనుస్సు పై
మది నుదయింమనాదుపగ ♦ మానఁగ నంగజసంగరంబున
న్మదవతి, నీదుకొప్పొడిసి ♦ మాటికిఁ బట్టుకొనంగ, నీమొద
ల్పదిగ నల్కం, నీపెదవిఁ బంటను సారెకు నొక్కఁ గోరితిన్॥

ఉ॥ మత్పరితాపమంబుజస ♦ మంచితవక్త్రి, న్నశోకపల్లవాం
చత్పరిభాసితాంఘ్రిని, ర ♦ సాలసమాధర, మల్లికాంగి, నీ
లోత్పల నేత్రి, నిన్నుఁ గను♦చునన కోలందిని హెచ్చఁజొచ్చెఁనో
యుత్పలగంధి, పంచిశరుఁ ♦ పూనుశరంబులనిగ్గుకో కదా?॥ 10

చ॥ కవ్రు లెటు లన్న నేమి? యువ ♦ కారి యగుం గద శంబరారి? ని
గ్గవుఁగిట బిగ్గఁ జేర్చుకొనఁ ♦ గా నుబుకుం కలయట్టి నీదు చ
గ్గవ నడిభాగమం దిముడఁ ♦ కాఁ గడుఁ గష్ట మటంచు నెంచియే,
తవురఁగఁ దూపులం బఱిపి ♦ తద్దయు గ్రుచ్చెడు నాయురస్థలిన్॥

చ॥ విరహపువేఁడిచే మిగుల ♦ వేదనఁ బొందుచు నున్న వాఁడ, దు
ష్కరముభరింపఁ శీనగవుఁ ♦ గప్పురముం, జనుతమ్మి మొగ్గలుం,
గరకిసలంబు, లూర్పువలి ♦ గాలులు, బాహుమృణాళిము, ల్నిరం

తరముగు నేనఁ జేర్చిన గ - దా ముగుదా, యుపశాంతిగల్గెడున్!

చ॥ బిగువును బింకముం దనర - బిట్టుగ లోపలఁ గ్రుమ్ములాడు, నా
పఁగ మఱియింత గ్రుళ్ళిపడుఁ, - బైకికి భేదము లేనియట్టులే
యగపడు నీదునిబ్బరపు - టబ్బురపున్బిగుబ్బ, లాడనే
నగ నది? "మర్ధ౦బె గుణ - మర్ధం," మట్టులు చేయనీయుమా॥

ఉ॥ తొకముడి న్సడల్చి కడు - ఁజంపిలు నీ బలితంపుఁజన్నుల
న్నా కరమందుఁ బట్టుమని - నం, కరవం దవి యట్ట నందు నో?
కొకముడి న్సడల్చి కులు - కుంగన్గనుం గయికొంట కష్ట మే
మో? కమలాక్షి! "సూక్ష్మమున - మోక్షము" గల్గనిరీతిగాన గుణా

మ॥ కనకాంచితిలకంబ, కుం ఁముపరా - గంబుం బయిం బూసికొం
చును నే ల్పాధర చేయు బ ల్లరిడ్డిము - ద్చు, న్గాచె నీ నిసుల
స్తనముల్? ల్పాలఁ దయాను గోనె తగు, జే - తంజిక్కనే? కం మొకం
బును విప్పంగ నొకప్డు పట్ట గల నేమో నే బ్రయత్నించెదన్॥

శా॥ కాంతా! మీఁటినయంత విచ్చునులే - కన్పట్టును న్నీదు చ
న్బంతుల్ బ్బ, కొనంగ మిట్టి పడున - న్నా! నాలిమ్రుచ్చు ల్గదా?
యేంకో సిగ్గున జాలుగా బయటంలో - నే యున్న యట్లుండియు
న్నుంగ్రెం దము నెవ్వరేని గన బి - ల్చుం బట్ట రండం చహా!

ఉ॥ నీ యలవన్నె, నీ కచము - నీ మెయిచాయను నారయంగ గం
గాయమునాసరస్వతులు - గా హృదిఁనంబున నిశ్చయించితిన్,
మాంసురె! పుణ్యభూమివి సు - మా' నిను జేరినివారి కెల్లను
న్మాయు మనోజతాపములు, - మానిని, నన్నిక జేర దీయుమా!

చ॥ పొలతిరో! నిదుమోవిఫలి - ము వ్వచనాంబుకణంబు, లూర్పుగా
లులె నిరతంబు గ్రోలుమను - లోపల చెలువంబి చూచుచు
స్ఖలితపుగుబ్బగుబ్బలుల - పై దప మే నొనరింతు; గూర్మియు
గలముగ నీనిమోక్షమును - గల్గగ జేయుమ నాకు నీవికన్॥

భమ లను గోళ్ల నిచ్చెమెయి - వచ్చిన గేసరిడింభకుండ, సం
భ్రమమున వేణీసర్పమును - బట్టుకొనంగ వినాయకుండనుం
జామి, యిటునీదుపొం దొదవు-చో నిరతమ్ము నను బ్రహ్మచారినే॥23

శా॥ ఏలా యో బలుసోయగంబులకు దీ - పీ! జాలముం జేయ? నే
నే లీల న్విరహాబ్ధి నీదుదును? ని - న్నేలాఘనం జేసిర్?
జాలిం జూపకయున్న మన్మథశరా - సారమ్ముచే మున్గెదం?
దేలింపం గదె గుబ్బకుండలను గుం - డె న్నోమ్మి నన్నీయెడన్॥ 24

సీ॥ నలుదిక్కులం జీక - టులు గ్రమ్మ గబరీభ
ర మ్మను హాలాహ - లమ్ము చెదర,
మిగుల బొంకంబుగా - బిగబ్బిగుబ్బ ల
న్వాలిపే న్గకుంభము - ల్వాలికి దోప,
నడ్డంబుగా బాహు - లను నట్టె వేలుపు
మ్రాకులే గొమ్మలు - పైకిలేన,
నెల్లెడ న్వెన్నెల - ల్చల్లుచు జిలునగ-
వనెడు చంద్రప్రభ - జనన మొంద

తే॥ కి! వరుస నిట్లు నీ సౌదర్య - వారధి రతి
మధనమును నొనర్చి యధర - మధురసుధను
బొందు టెన్నడొ? యో జగ - న్మోహినీ! భ
వత్కరుణ లేక యది పొంద వశమె నాకు? 25

చ॥ కనికర మించు కేనియును - గల్గినదానవు కా వటంచు ని
న్నవ గలనా? దినంబు లల - నా, కల లందున నైన రాత్రులం
గనబడి నన్ను దన్నుదువు - గా? పది వే లదె, "లేని మామక
నన్నుగడు గ్రుడ్డిమామ యయి నన్నయ" మన్నది యున్న దేకదా

సీ॥ ఎదురొత్తు కులుకు గ - గ్గద మెత్తు పలుకును
నలరెడు రతిసమ - యంపువెరవు,

జెలరేగు కుసుమలు ను - య్యేల రూగుసకులును
నింపాను పుసుపాయి - తంపుహాసువు,
నర డిందుచూావు జం -దర చెందురూపును
దనరు చున్న సురతాం - తంపుదెలివు,
విడశాఱు హైకపె - మ్మడి జాఱుకోకయు
దగ శాన్పైపై నుండి - డిగెడుముసువు,
తే॥ గీ। గలలలోపల బలుమాఱు - గాంచి కాంచి,
కాంక్షదీఱ ని న్నాఁకమాఱ - కౌగలించి,
యంతలో నిద్రమేల్కాంచి - యంతో వంత
గాంచు చుందు నిన్నాన కో - మించు బోణి! 27
చ॥ కల నొకమాఱు నీవు జవి - కధరియింపక జిల్గుబయ్యెదం
దొలగగ గ్రోయ నిక్కుజను -దోయి ఖచిక్కున గ్రమ్మనాయుర
స్థలి సవిదూఱ చిక్కునడి - చచ్చిన రా వట! నూత్నపార్వతీ
శులనలెన ల్లయుందు ఏట - చోద్యముగా మన మెల్ల కాలమున్
చ॥ ఇక మఱియొక్కమాఱు నిను - నే బిగియారగ గౌగలింపగా
శకపిక లాగు నీ చనులు - వీపున దూసిన వంట! నేవికా
నికను 'విచిత్రపున్నిజానే - నీపున జన్నులు పుట్టె! నంచు దా
నికి వెడనవ్వు నవ్వుచును- నిద్దుర లేచితి, నంద త్రే మనన్ 29
చ॥ మఱియొకమాఱు వెల్లకిల మంచముమీద బసుండి నంట! నే
దొఱగగ నీదుపయ్యెదను - ద్రోయగ బుస్సున నూగుటారు పా
ము, రపిక విప్ప వాడిమొన ముక్కులతో జనుజక్కవల్ననుం
గఱవగ వచ్చెనంట! యది - కన్గొని భీతిని మేలు కాంచితిన్ 30
చ॥ ఎలమి మ ఱొక్కమాఱు మన ♦ మిర్వురముం బసివార మైకలం
బలుమఱు నాటలాడు నెడ ♦ బాలరో! నీదు నితంబసైకత
స్థలములమీదికా నసెడ ♦ సన్ననిపుల్లను నేనుగాంచగా

మ॥ మగలా గీ డోకస్వప్న మందు నానరిం - వ, న్నేను సాంపార నై
కగయం జేతుల రెంట నీదుచనుదో - యిం గట్టిగా బట్టగా
నగి, గోవర్ధనమందరంబులను శ్రీ - నాథుండు నే డొక్కసా
రిగమోాసెంగమ?, డంచుబల్కితివి నం - ప్రీతాత్మవై నాతిరో 38

మ॥ చెలియా! యెన్నియొ యింద్రజాలముల నే ర్చెన్నీ చనుల్చందనం
బలదంగా హిమవంతము, ల్పసువు పూయన్మేరువు ల్కుంకుమం
బొలయంగా నుదయంబులు , స్మరిగమం - బొప్పారగా నంజనం
బు!,అటనం, 'గవినార్వభౌముడవె యూ - యొ మ్మంటినన్నుంగలన్

మ॥ పొలయుల్కుంగలలోన నీ నవలిమోముం గాగ బన్నుండ, 'నీ
బలుచ న్నిప్పలు మోముదామరయు దిరి -ప్పచన్నోత్రిలుల సైనికత
స్థలులుం గొప్పనునాచు లేవె మతి ?, నీ - సౌందర్యగంగాఝురిం
గల దే యీాదరి మేలటన్న ?, దని ప- ల్కం గోపమున్నానవా? 40

చ॥ పడతిరో! పూవుముల్కులను - బల్మఱు మాఁడలంత పెట్టగా
నడలుచు నిన్ను జేర నను - నద్దిర! నీ బలితంపుగుబ్బలం
బొడుచుచు బాధ పెట్టుటకు - బూనితి నిద్దియె ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడచినచంద,! మన్న నగ - వా? తగవా కలలోన నేనియున్? 41

ఉ॥ చక్కని పెన్గొడ ల్చిగుపు - జన్మాగడ ల్మురిపెంపునెన్నడ
ల్గ్రిక్కన గాంచి, స్వప్నముల - గంటునిదంతి వటంచు నెంచి నీ
పుక్కరినాకు నోడము - డోడుటయు న్సమకూడు నంచు నో
చక్కరబొమ్మ! విన్నతమ- సంగర మందు జయింతు వేమఱున్॥ 42

ఉ॥ నీదు శిరోజనీలముల - నీ యధరాధర పద్మరాగము,
న్నీదు నఖాళివజ్రముల - నేను హరింతు న టన్న గూడ నీ
ల్గా దని కర్కశ స్తనశి - లామయు మూ బిగువుంగవుంగిటన్
ఖైదుగ బాహుపాశముల - గట్టవె న న్గల లందు సుందరీ?॥ 43

సీ॥ ఘనవేణి! నీ కొప్పు - గగనంబు నం దెల్ల

నున్నది నిండ యం - చొక్కమాళుక్షి
శశిముఖ! నీమోము - చంద్రిక ల్వెల్లె న
ల్దిక్కులం దంచు నే - తొక్క మాళు,
నగకుచ నీ చను - ల్జగతీతలము మోపియు
చున్నవి యంచు నిం - కొక్కమాళు,
సుమగాత్రి! నీ మేను - ప్రమదావనుల నెల్ల
నున్నది యంచు న - తొక్కమాళు,
ఆ॥ వె॥ మఱియు నింక బెక్కు - మాళులు ని బలు
తళుకుగన్ను లెల్ల - కొలకులందు
జెలగు చున్న నంచు - జిత్రంబుగా నేడు
గలల యుందు గంటి - గలువకంటి 44

సీ॥ తొగతేని గననీదు - నగుమొగం బాదిని
గనిపించి కిసలము - ల్గానిపించు
గమలము ల్గన నీదు - కరముల దొలుతను
గనిపించి కిసలము - ల్గానిపించు,
గిసలము ల్గన నీదు - కెమ్మోవి మొదటను
గనిపించి తేనియు - గానిపించు,
దేనియ గన నీదు తీయపల్కులు ముందు 2
గనిపించి యమృతంబు గానిపించు,
తే॥ గీ॥ నమృతము గనంగ నీ మంద - హాసముపోద
మమున గనిపించి తొగతేదు - మఱిలక్ష్మి మొ
గమ్ము గనిపించు, నీ రీతి - గలలలోన
నెటుల జూచిన గనిపింతు - వీవె నాకు! 45

సీ॥ రంభ గూడినభంగి - రాగింతు నీ తొ డ
లమర కే నిమిరిన - యటు లెన,

హేమ గూడిన లీల - నెంచెగ నీరూఢ
లాసక్తి స్పృశియించి - నట్టులైన;
దార గూడినరీతి - దలతును నీగోళ్ళ
వక్షితో ముద్దిడి - నట్టులైన;
హరిణి గూడినమాడ్కి - నను గొండు నీచూపు
లనురాగమున జూచి - నట్టులైన;
తే॥గీ॥ స్వప్నములయందుగాన న - చ్చలపొరద
టంచు పొందు నేరు భా - వించుచుందు;
గానిచో నీకు నవ్వరః - కామినులకు
"హస్తిమశకాంతమ్ము" సు - మా సుమాంగి! 46
సీ, కూర్మబంధమున - కూడుదునో భామ!
సింహవిక్రమము నా - సింతు లేమ!
గజబంధమున రతి - గావింతు మదవతి!
ఏణబంధము మది - నెంతు యువతి!
ధనురాఖ్య బంధంబు - నొనరింతు మరుదంతి!
యర్ధచంద్ర మొనర్తు - నందు నింతి!
భ్రమరబంధంబున - రమియింతు గరియాన!
మాయూరమున నుంతు - మనను చాన!
తే॥గీ॥ కలలలోపల నీదు మీ - గాళ్ళ గాను
జన్నుగవను, గన్నుగవను - గన్నుబొమల.
నెన్నుదురు, ముంగురులల, బలు - పిన్నఱులను
గాంచి యాబంధముల నీకు - గాంక్ష యనుచు.
చ॥ అబలరో! కామశాస్త్రపుర - హస్యము లెల్ల నెఱుంగువారిలో
బ్రబలుడ నంచు నెంచి బహు - భంగుల నవ్వులతోడు కూడ బూ
గుబురుల బూజ సేసె నిది - గో! మఱినీవును నిస్తులస్త న
స్తబక యుగంబు నా యురము - దాకగ దండలవేయుమా మొదన్.

నాగపాశ బంధము

చ॥ అమరగ భోగినీముచిత - వైతనుచు న్గడ జూడ దోచు, మా
న్యముగ భుజంగుడన్, - మది గనంగ దళం బగినారమే చుమీ!
క్రమ విడ, నింక నోము నను - జానుగఁ జెల్వగునాగపాశబం
ధమున రతుండ నో మహిళ, శాళన చుమ్మిక నీ భువిం జెలీ

చక్రబంధము

శా॥ కన్యా' శృంగిసయానబంధురకుచా! - కల్యాణసుశ్రీరామా!
ధన్యా' గానకళాధురందర! కళా - తంత్రాసమానాచరా,
జన్యైరమ్మదజైత్రి సుందరకటా - తూ, యిద్దియే ధర్మమా?
మాన్యాత్మా!కడు బాధగల్గె, నను లే - మాటన్నరా జూడమా॥

రసికాభిలాసము

సమాప్తము,

---

సెట్టి లక్ష్మనరసింహ్వ కృత

# సరసచాటువులు:

తే॥ గీ॥ పూర్ణశశిసమమై మోము - పోలిచెనమ్మొ?
కుచుల పేరి మబ్బులు దగు - లోకానియె నడ్డ,
నాతిమిన్న నాతోడ ని - న్న మగలాగు
కౌతుకమున సల్ప దానిపై - కొన్నయపుడు!

తే॥ గీ॥ కను, ప్రియా, తులనయళి యీ - యాకలునపూకు
అంగటం గని, యిందు మ - రందమొడ్డ
గిల్లఁ నెంతొప్ప నం చుల్ల - సిల్లుచు, నది
గ్రోలి నిదుర పొందెం గలు - కుచునచటనె॥ ౨

ఉ॥ "ఇంతలు చన్ను లుండ మఱి-యెవ్వరి గూడెదు భామరాంగ? యే
కాంతమునందు నున్న జవ - రాల, ద్రవం బడి వెక్కతీయులా
గింతయు గాక, నీ వెఱుగ - వే మరు డిచ్చిన దారి చొప్పు? నీ
వింత భయంబుమై నుడుగ - వెల్లిద మాదువు, మాట లేటికిఁ॥"

ఉ॥ 'నిక్కదు, దోవ నేల? తరు - ణీకులరత్నమ, యింక నీవయిం
జిక్కె ఘనంబు నీకు, విను, - చిత్తజుదండము జప్పరించెగో?
చొక్క బరాంగిమద్యముల - చూఱల బాటిలు వేడిచేత బెం
పెక్కదజేసి దాని మఱు - నింటను దూఱిచి యాదరించెదో?'''

సమస్య - చన్నుల వంక జూపె జల జాస్యవిటుందు తొంగి పోవఁగన్

ఉ॥ "క్రొన్ననవిల్తుగేళి గవ - గూడఁగ నియ్యెలతోట గోనికిన్
నిన్నిపు డేగుదె మ్మనుచు - నేగబు రంపితి నంత నా చెలుల్
తిన్నగి సిద్ధంబున క దే! చనుదంచుచు న్నుర్మి" గం
చన్నులవంక జూపె జల - జాస్య ఎటుండు తొలంగి పోవఁగన్।

సమస్య - యో నిరతంబు జయు నను - డొందను పాపము బొందు
పుణ్యముల్‌॥

ఉ॥ మానక 'రామ, రామ,' యని - మానసమందు శివుండు నిత్యమున్
ధ్యానము జేయుచుండ, నల - తారక నామము జిత్తమందు శ్ర
ద్ధానియమంబులొప్ప గను-దాను బునశ్చరణంబు వందొ, వేయో
నిరతంబు జేయునను - డొందను పాపము, బొందుపుణ్యముల్‌॥

సమస్య - 'భగమును నీవు పెట్టగను - దానముచేసినవాడనే' యన-॥

ఉ॥ దగ గొని దుస్ససేనుని రొ - దగ గల నెత్తురు గ్రోలు భీముడం
తఁ గురుపతిం గనుంగొనుచు - 'రా నెదవంటిగా, ద్రావితిన్ మహో

నగుసద్భృశుండు వీని రుధిరం బనివన్ విమతేః విమంబు దు
ర్భగ! మును నీవు పెట్టగను శానము జేసినవాడనే' యనెన్॥
సమస్య:- డెంగస్సత్తువ చాల దంచు రమణిం దేర్చెన్ రతిక్రీడలన్॥
శా॥ అంగంబుల్ విటుబొయ్యనంగ్రమముగా - నంటంగ రోచేడ 'నా
భింగేల్పెట్టెద? వేది యొందొ సరిగా - వీక్షింప లేవే?' యనం
గం, గాంతుండు పకాలు మంచు నగుచుం - గన్దోయిచత్వారమౌం
డెం, గన్సత్తువచాల' దంచు రమణించె - దేర్చెన్ రతిక్రీడలన్
సమస్య:- రంభ త్రికోణమధ్యమున రత్నము భాసిలె నుద్భుతంబుగన్
ఉ॥ జంభవిరోధి కోడిని ని ? శాచగు లాతని పంపునన్
దంభము మాని రంభ-మరు ధామమునం దల లుంచి త్రొక్కసం
రంభమునందు నూడి. రెయిక - రత్నము లోపట జిక్కె నందుచే
రంభ త్రికోణమధ్యమున రత్నము భాసిలె నద్భుతంబుగన్
క॥ ధనకాంతుమ గల గణికా
కనకాంగులతోడ జిత్త - కార్తి దిబుగు స్త్రీ
తుసకాలను దక్కెడనో.
తునిగోలనొ తూచి. సరిగ - దూగగ వచ్చున్॥ ౧౦
చ॥ ఖగపతి తెచ్చు చున్నపుడు - కాజి సుధాలవమే పొగాకుగా
జగతిని బుట్ట వొందెనను - సంగతి సత్య మటంచుదా మెఱుం
గ గలుగు చంద్రుగాడె గణి - కామధురోష్ఠసుధారసంబు ద్రా
గగ గమకించు నట్టి విట - కాని, ద్రట బుట్టుడి చుట్ట వాసనన్॥
ఉ॥ విత్తులనుండి చెట్లు ప్రథ - వించుట యున్నదిగాని. పండ్లె యు
త్పత్తిని బొందు టబ్రము గ - దా? వనమాలిసుతుండ స్త్రీలకున్
హృత్తట మందు జిన్నపుడ - రెం డినుమమంతలు విత్తు లుంచగా,
గ్రొత్తవయస్సు నాటి కవి - రూ పగు గుత్తపు దబ్బపండ్లుగా॥
క॥ మదను డను స్వర్ణకారుడు
పదకము చెలి తొడలి నడుమ - బాగుగ నిడి, రే

యదుకుం బెట్టెనా? పగిలిన
దది సీల బిగింపు లింక - నవరత మర్యోన్॥

చ॥ మొగములుమాసమందునొక - మూడుదినంబులుదక్క స్త్రీలకున్
మిగిలిన యట్టి రోజులను - మెచ్చొదవించును పీడ్యవున్నిగిన్;
భగములు మూడు రోజులన - పాపము! తద్విధ మైన పీడ్యవు
న్నిగిని ధరించు చుండు: విధి - చేసెను దాదృశపక్షపాతముల్॥

ఉ॥ ఏతఱి మన్మథుండు తన - యింటి వయిన్ నును తేంట్ల కావుగా
రాతిరియుం బవల్ నిలిపి, - రా గమకించు భుజంగతండమున్
'హా! తను, 'హాతు హా!' తనును -'హా!' తను! వయ్యావిందుచేతన్
యాతులు గాగ మాఱిచవి - యాదిహాకారము లోపమా గదా

తే॥ గీ॥ మారు డాత్మదండంబును - బూరుషుల ప
రంబు గావించి ,నిజమదిం - రము రమణుల
వశముచేయంగ, నయ్యది - వచ్చి యిందు
జొచ్చు: నలవాటు మాన్పుట - సులభమగునె?।

ఉ॥ చిత్తవ[illegible]నందు సంభవము - చెందిన మన్మథుడాను నిల్వగా
నొత్తెడు గల్గె గర్కశప - యోధరభూధరకర్షణంబునం,
గ్రొత్త నివాస మేర్పఱుచు - కొంటకు నూరుల కేగి యచ్చటన్
బెత్తెడు కొంప నుండియును, - బిండు నతండు సమస్తవీర్యముల్।

తే॥ గీ॥ ఊరుల నడుమ మన్మథు - డుండ నీడ్లు
కట్టికొనె; దానిపై దోలు - కాయ కప్పు
తతి ప్రబలి ద్వారముల గప్పు - దండములను
దోలగ ద్రోయుండనుచు బురు - షులను బంపు॥

చ॥ ఘనతర కార్యముల్ సలుప - గల్గ బ్రహోజకు లైనవారికిన్
పెనుక సహాయ ముండుఽ. క - నీస మొకర్వారయేని; బ్రహ్మదే
వుని గణి సృష్టి సల్పుటకు - బూనిన కర్ణము పెన్కవందముల్
ఘనరుట గాలి యా పనిని - దా నొనరింపగ సేర్పు ఆక్కగన్

మ॥ నెలకున్ ముప్పది జీతముం గొనుచు నం- తే స్వేచ్ఛగా నున్న వే
శ్యల బియ్యాల, దదర్ధజీవితములం -దాట్కిరిగులం జేసి కు
మ్కిలుబియ్యేల్ గని యొుక్కుకాల మనుదెం - చెంగాడే యాకారమే
విలువం దెచ్చు నటంచు మాఱు డిపులో- బియ్యేలు?బియ్యాలుగా
(బియ్య (బ్రథమున) — భగము బియ్యే (B A ) ఆక్టింగు
(**Acting**) ఖాయము కానిది, ఆకారము ఏ ఆయన్న యకురము,
(గూఁకము)

ఉ॥ లోవాగులం గడాని, ఋహా - లోకపు గింజలకో బటాని, జ
హ్వాతదాయకాళలవ - దార్ధచయంబున జీనియున్, జగ
న్మోహనులందు సాని, కవి-పుంగవు లంకు శతావధాని, స్త్రీ
దేహమునందు మోనియు బ్రతిష్ఠను గాంచెను శ్రేష్టతన్ భువిన్॥

క॥ జాకెట్టున గల వాచీ
పాకెటున జేయి పెట్టి, - "పడతీ, వాచీ
లేకిస్తు టిక్కిక్కులు
నీ కిస్తులు కలిగె ?" నంచు - నెయ్యుం డడిగెన్॥

జాకెటు (**Jacket**) స్త్రీలుతొడుగుకొనుజాబ్బాకు పాకెట్టు (**Pocket**) జేబు వాచి (**Wach**) జేబుగడియారము)

ఉ స్త్రీ లు చనుల్ మిటంబు లయి ప్రీతినిగొల్పును, బట్ట రాని బొం
డా యియున్ విలుల్ నిరసన - నం బొనరింతురు వానినిన్ టెనిస్
బాలను జేతబట్టుకొని - గాలకు లాడుదు, రట్లు గాక పుట్
బాలును గాళ్ళదన్నగ గ - డంగుదు, రెందరు గల్గ నందఱున్
బాలు (**Ball**) బంతి టెనిస్ (**Tennis**) పుట్ (**foot**) కాలు

ఉ॥ కాముకు కుట్టువాండ్ర చెలి - కాడెయుగెన్ మగవారి బ్రేమతో
గోటాయి లారయన్, రవికె - కుట్లు పుటు కనిపించు, నట్టు లే
భామల వంక బూరుషులు - భ్రాంతిమెయిగను లెత్తిచూడ బొం
ఢ్లానులకన్న బట్టనులు - ట ప్పనిపించును జవ్వాచవ్వానన్॥

(పెంట్లాము- (**Pentaloons**) షరాయి బట్టను- (**Botton**) గుండీ
చ॥ దారలటు నున్నగా నుసువు-దోపగ, మీసము గడ్డమున్ మరల
త్వరగను షేవు చేసికొను - భర్తల గన్గొని భార్య, "అక్కటా!
హారిదల మంచు, బూడిద యు-టంచును, మాకిక నేలకీ మీదురే
జనులను దెండి," యందురు, ఇహా-సన్ముఖులౌచునా వారుషాంతనన్
(షేవు (**Shave**) క్షవరము, రేజరు (**Razor**) మంగలికత్తి)
చ॥ క్షవరము కాంచెడున్ సివిలు - సర్వీసుజోన ప్రవేశమైన వా
రి వదనముల్ భువిన్ మిలట - రీ పని వారికి మీస లెప్పుడుం
కుతుకము యుంచు నూనశిర - దారుణసంగర మందు నుండు న
ట్టివి గనుకన్ భంగములకు - శీకుగ మీసము లుండు చెంపలన్
(సివిలు సర్వీసు, (**Civil Service**) యుద్ధసంబంధము కాని
కొలువు మిలటరీ - (**Military**) యుద్ధసంబంధమైన కొలువు,
కా॥ కెల్విన్‌షాపున బట్టకై చెలియ వాంఛింపగా, "సఖి,పూర్వపున్
వల్వాకావులేక?" నంచు భర్తను సం- ప్రశ్నించె, నింగ్లీషునం
దల్వం-కల్గు భార్య, "పూర్వపుది కా-దేనన్ గ్రొత్తదిన్‌వచ్చునా?
మొల్వం బోలును మీకు పీనిసులు తే - పున్ మావు నంచున్!
(షాపు (**Shop**) దుకాణము వల్వా (**Vulvca**) యోని
పీనిసు (**Penis**) శిశ్నము పూర్వపున్ వల్వాకావలెన్ ఘనుకటి
తకపు బటయా కావలయునని భర్త యడిగెను, పూర్వపు యోని
కావలయునని భర్త యడిగెనని ఇంగ్లీషు చదువుకొన్న భార్య యొక
యర్థములేసి, యొకసక్కెము చేసినది,)
చ॥ తవితను నేర్చుకొన్న గళీ-కం గనుచున్ రసికుండు, "చెప్పవే మొ
క్క- విషయమున్ మొగంబునే భ-గంబున గల్గిన దెద్దిలోయన్న స
య్యువతి యొంబుంగడమ్మో, నత - ముత్యాల పద్మముఖాక్షరాళి నా
ల్గవదియు జెప్పినన్ భగము - గాదె గణింకి' బనివక్కెనవ్వుచున్

ఆడగ బొంగరాలు గల - వంచుచు బిల్బులు లోనికిం బడా
తేడుల మేనఱుల్లు గొని - రేఁగి, యటం జనుబొంగరా లేదం
గాడెదునట్లు మోపి, గసి - కన్ మఱిదింప గదోయి" యంచునుం
గూడెను వానితోడనొక - గుబ్బిత నేస్తుల నెల్ల నేర్పుచున్॥ అగా

ఉ॥ ముప్పదియేండ్లు నాకు, బదు - మూఁడవ యేడుది మాదుచెల్లి మే
మిప్పుడు బూటకూళ్ళ నుతి - కెక్కినవారము, దబ్బకాయయో,
చెప్పుడు, నిమ్మకాయొ, తమ - చిత్తము వచ్చిననుండు, రాత్రికిం
దప్పక రండి డనున్ నవవి - తంతు వొకర్తుక గాటనారులన్॥

ఉ॥ వంటల బాపనక్క కడు - వంగుచు ఏడ్వక చేయి విస్తటం
జంటిమొనల్ పండె, బడిన - "జాలున, మాడినయూవడొంబులన్
రెంటిని రెండుప్రక్కల న - రే! యీవు వేసితిరే" యటం చనేం
గొంటెతనంబుగాగ నొక కుఱ్ఱడు, ప్రక్కను గన్ను గీటుచున్॥

ఉ॥ "ఊమ్మన నాటి పీవునకు - రోసతి చన్నులు దూసెనో యనెం
దిమ్మకపీంద్రు, డోమదవ - తీ, పరమాద్భుత మొప్ప నీ యురో
జమ్ములు ఊమ్ముచుట్టునకు - సాగుచు పీవున నిట్టటున్ సమా
నమ్ముగ బ్రాకుచుం, జనుమొ - నల్ వెనుప్రాసనే డకోనంగదే॥

ఉ॥ తగ్గక క్రిందనుండి సరి - తాకునుగా నెదురొత్తు లొత్తియున్,
బిగ్గ గవుగలించియు, న - భీష్టము తీఱక మిండగాని దా
దిగ్గున ద్రోసి, పైకొని, ర - తిన్ సివ మెత్తిన గాలరండకున్
వి గ్గెడలంగ గుం డవుడు - వెల్వడె నూను ఫిరంగి గుం డటుల్॥

(విగ్గు Wig) ఆడువేషము వేయునప్పుడు వేసికొను తల వెంట్రుకలతోడి టోపీ)

ఉ॥ "పూర్వసువాసినీ, భగమం - పుష్కలరోషమయంబు నీకు, నా
శర్వుని లింగ మట్లుగ న - సంగెను నీదు శిరంబు, సంతసం
బర్వున నేగి వాడి గల - మంగలిక త్తిని దెమ్ము, దానితో
సర్వము జక్కనౌ, నిచటి - శమ్మము లచ్చట బెట్టుటే కదా!"

చ॥ కనుగవ యంట చెల్ల, దలి - కంబున గన్ గల కంభుజెవ్వచో
జనుగవ యంట యా విధవ - చావయెడన్ సరిపోవ, దామె ను
న్నని శిరమే రతిన్ విటజ - నంబుల చేతుల నుండు ట న్నటుల్:
స్తనములజాగతి స్తనవి - ధంబున బొందిన వామె కందుచే.

ఉ॥ ముట్టుతబోడ గూడి, యొల - ప్రొద్దున నింటికి సందుగొందులన్
గుట్టుగ బోవు నట్టి యను - గుం జెలికాని నొకండు గాంచి, 'పున్
జెట్టికి నైనటుల్ రుధిర - సిక్తములైనవి నీదువస్త్రముల్;
గట్టిగ మారసంగరము - కల్గినదా?' యని నవ్వ బిగ్గరన్।

చ॥ వెలదిరొ, రంభ కన్న, విరి - విల్తుని పొల్తుకకన్న వన్నచి
న్నెలు గల యన్నుమిన్న వని - నిన్ వివయింతు న టన్న, నీభగ
స్థల మెంట పుచ్చియున్నదొ గదా యని జంకుదు? నీమొగమందునం
దొలసెడు నంత నున్నదన - మున్నదె చెప్పుము నీ భగంబునన్।

మ॥ శివదీక్షాపరురాలు జంగ మది తా - (శ్రీ) వైష్ణవ స్వాముల
గవ గూడంగ దొడంగె వారలకు లిం - గా లుండుటం జేసి, వై
ష్ణవులున్ దాని స్తనద్వయంబు గనుచుం - 'జక్రాంకితంబయ్యె, నిం
క వృథాశంక య దేల?' యంచు గలియం-గా సాగి రత్యంతతో

ఉ॥ అంగజకేళి, గౌరియొక - యన్యవధూమణి శయ్య జేర, ద
న్నంగవ బట్టుచుం, బెదవి - నొక్కుచు మక్కువతో, విటుడు నీ
వెం గడకొత్తి, రోమచయ వి స్తృతయోనిని గాంచి నంతనే
మంగలిదాని యంగనయె - మంచి దటంచు దలంచె నాత్మలో।

ఉ॥ జామి ఫలంబు గోయ వెల - యొకరుక చెట్టు నెక్కగా,
భూమి విటుండు నిల్వబడి, - బోటిరొ, జామిని రాబియాతు నా
కే మొయి గానిపించె, నన - నింతియు గాబర కచ్చపోసి. 'పో.
నీ మొగ!' మంచు బల్కెడన - నచ్చెలు లెల్ల బకాపకన్ నగన్

ఉ॥ కొండలు సంచలించె, నిది - గో! గగనంబు వడంకె నంచునూ
దండి సున్నయట్టి వృష - ణంబుల వాడు రతంబు నందు వై
నుండిన భామ చన్కవును-లూగుచు నుండుట గాంచి పల్క, 'బ్ర
హ్మాండము లల్లాడు రతి - యప్పుడు,' కన నామె నవ్వుచున్

చ॥ దన్నులు లేని యట్టి వెల - చానను గుండదు, "గుండెనీళ్ళు నా
కున్నవె యున్నదో నిలలో-రూని కడన్ మఱియెట్టులున్నదో?"
యన్నను, "నీదుమూతి యటు-లయ్యెదివూ ర్తిగనుండె, నమ్ముమా
కన్నము కద్దు, మీసమును - గద్దని నవ్వెను వేశ్య పక్కునన్॥

ఉ॥ "పాకోక తొమ్ము పెట్టినను- భామిని యయ్యది పూయగుంగదా?
పూకును దీర్ఘముం గలుప - బోవగ నేమగు?" నన్న జారుతో
"లోకులు వ్యర్థమంద్రు రతి - లో దెగబారెడు దీర్ఘమైనదే
నీ కటువంటి దున్నదే? య - నెన్ వెలజవ్వని బిగ్గ నవ్వుచున్॥

ఉ॥ ముద్దులసానిచెల్లి మొగ - ముం గని నవ్వుచు మిండగాడు 'నీ
యుద్దము దెచ్చి చూపగదె' - యన్న దదగ్రజ 'యగ్గి కొద్దిగా
బ్రద్దలు వేసె నో ప్రియ! భ - వన్ముఖమందు గానంగ, నీ
కిద్దఱి మోము లున్న యటు-లే కన నౌ నని నవ్వె గవ్వునన్॥

ఉ॥ చందురు నీ మొగంబునకు - నాటిగ బల్కెడి వారు దానిలో
గందును గాంచ లేదొ? గ శశికామణి-నీదు భంగము సాటి నే
యుం దగు, నంచు జారు డన - నచ్చెలి, యందలి సార మెల్ల నీ
కు తెలియంగనౌ, నగు న- గున్ విబుధుండ వనెన్ స్మితంబుతో

ఉ॥ 'కాజులో జూచితిరా! రసిక -రాజని జూచితి! గావి కొట్టిగా
రా! జగ మందు మిమ్ము సెన-రున్ సరిపోలయ మీరలే బృహ
ద్భుజము పేరిబొండ్లమును - బెట్టి భంగమునకున్ భయంబువలి
బూజ యొనర్త్రు' రంచు వెల-బోటి వచించెను వృద్ధవేశ్యతో॥

ఉ॥ బచ్చోకెడొక్క రోపడతి - బ్రాపకున్న మును వేసి, ప్రేమతో
నిచ్చె నమూల్యమైన తన - యెల్లధనంబు, బడంతి వానికింతి
బచ్చిసెగం దగిల్చె, నల - బచ్చు, "కొంతలె చెడి మొత్తచేతి కిక
వచ్చె,' న టంచు నేడ్చు సెగ బాధకు గచ్చనుజేయిదూర్చుచున్

ఉ॥ "నాయమిది నాకు; ముద్దిదియు - నాకును; చెల్లిదియు నాకు" యన్న
ద్దోయిని నఱచేసె వెల - తొయ్యలిపై సరసుండు; "తల్లి ము
న్నీయిలు మాకు ముప్పరకు - నిచ్చెను; నాదియనంగ బోకు వో
నాయక! యిప్పటి," నంచు వెల - నాతి నిసత్తరు జేసె నాతనిన్॥

క. "పనస తోటనుండి తొలగిం
చిన దానవె చెలియ, నల్ల - చీమల నెల్లం?
"జనుదెంచు నేమొ మగుడగ
ననంటిపం డీవు పెట్ట - నటవిటకాడా."

మ॥ తలక్రిందై తపమాచరించుచును గాం - తారత్నమా, నాకడం
గల దత్యద్భుతరూపు, డాతని వి - విక్త్రం బాస్థలిం బెట్టగా
వలయున్, నీకడనున్న కొండగుహ నీ - వా?" యంచుభుగ్యాంగి
దిలకించెన్ విటు, డామె "మౌని నడనె - త్తిన్ నోరుదద్దా?" యనెన్,

సరసచాటువులు - సంపూర్ణము.

# పూర్వకవుల

# చాటువులు.

ఉ॥ చేతికివచ్చువస్తు వెడ ♦ జేసితి, వాప్తులు శత్రులైరి, యే
రీతినినైన గార్య మొన ♦ రించెద నన్న నొనర్ప నీవు, నీ
చేతికి సాగి నంత పని ♦ జేసితి వింతియెకాని, యింక నా
యా తొలకైన బీక గల ♦ వా? గ్రహచారము! దుర్విచారమా!

ఉ। కూటమినొక్క నాటికి తిరి ♦ కోణసహస్రములన్ బెకల్చు నీ
ధాటికి ముజ్జగంబులును ♦ దట్టకమబ్బులు మంచుకొండలుగా
సాటికి నిల్వగా గలవె, ♦ చాలు శ్రీమంవుమి జృంభణంబు, నీ
పేటికి లేవ జూనితివి? ♦ యీ నడిజామున నోప్రజాపతీ॥

క॥ ఆ కాంతామణి యుపరతి
కాకాశము వణకె దార ♦ లల్లల నాడెన్
జోకై దగిరులు కదలెను
భీకరముగ దమము చంద్ర ♦ బింబం బంటెన్॥

క॥ సుదతీ! నీ కుచగిరు లిటు
కదళీ వర్షగా గూలినట్టి ♦ కారణ మేమే
చెదరి గిరు లైన గూలవె
కదసి వర్షి గ్రింద ద్రవ్వ ♦ గా! చెలువుండా!

క॥ పట్టితి రెండుకుచంబులు
పెట్టితి మటి తొడలసందు ♦ పెటపెట లాడన్
వట్టులు గంతులు వేయగ
గట్టిగ గొట్టితిని జుల్లి ♦ కంతగ మిగులన్!

ఉ॥ ఊరువులు బట్టి రా దిగిచి ♦ యున్నతమైన కుచద్వయంబుపై
చీర తొలంగ దీసి సతి ♦ జేకొని బిగ్గన గౌగిలించి తా
గోరినకోర్కె దీర్చుకొని ♦ కోమలి పొందక యున్న యట్టి యా
సారసు దెల్పెడి సురత ♦ సౌఖ్యము జెందిన జాణ లందఱున్॥ ౬

ఉ॥ ఆ కనకాంగి వంగికొని ♦ హంసలరీతిని ముగ్గొనర్పగా
వాకిట నున్న యొక్కవిట ♦ వర్యుడు గాంచి తదీయ యోనిపై
కోక దొలంగ దీసిసతి ♦ గూడి హుటాహుటి దెంగుచుండగా
తాకెఫిరంగిగుండు వలె ♦ దుడ్డు లతాంగికి గొడ్డుక్రిందికిన్॥ ౭

ఉ॥ అంగన లెంద రైనగల ♦ అందఱుపూకులు గల్గువారె నీ
కుంగల నై నగాని సరి ♦ గూడిన జాణలు లే రటంచు నిన్
దెంగిననాకు దెల్పె రది ♦ తెల్లము శిశ్నము గల్గినందుకున్
దెంగిన నిన్ను దెంగవలె ♦ తెం పలరంగను నీలవేణిరో॥ ౮

తే॥ గీ॥ పిన్న వయసుది పై నెక్కి ♦ పెదవినొక్కి
యల్లతావున చెయివేసి ♦ మెల్లదీసి
మదనమందిరమునను దా ♦ నదుముకొనియు
వత్తివలె నున్న ముదిమికి ♦ మొత్తుకొనియె॥ ౯

ఉ॥ కోరిక లుప్పతిల్ల మది ♦ గోరిన యట్టి కళావిశేషముల్
చారుతరంబులన్ రతుల ♦ సల్పగ నేర్చిన యట్టిజాణ యీ
వారవధూశిరోమణిని ♦ సంతులు వేసుక దెబ్బతీయుడీ
మీరును మీరుమీరె మఱి ♦ మీరును మీరును మీరలందఱున్

తే॥ గీ॥ పన్నగం బాడ నక్షత్ర ♦ పఙ్క్తి పీడ
గగన మల్లాడ ఘలఘలు ♦ గ్గలని యాడ
చంద్రమండలమున జల ♦ సౌరిది మొల్ల
నుపరతి యొనర్చె నవ్వాడ ♦ యుత్పలాక్షి॥ ౧౧

ఉ॥ మాఘమున శేవు దీని కొంశ – మైథున కొక్కుడటెత్తు దీని యు
ద్ధావనతి మానదు వశ్రి – తాపము సళ్ళదు మాండమాపులన్
జూపుమటన్న మాపిటికి – జాపెదనన్నను రొమ్ర్చి నిల్వ దీ
పావపు మేఘరిదండ మొక – పట్టున కొంంతిని గొండ దీశ్వరా! ౧౨

క॥ ఇంగిత మెఱుగని తొత్తును
దెంగిన నపకీర్తి వచ్చు – దేహము నొచ్చున్
పింగుకు పడతము పట్టును
గంగాధర దానిపూకు – గాడ్దెలు దెంగా॥

ఉ॥ జంగమురాలి బట్టి నొక – జంగము వంగగ బెట్టి యోనిలో
లింగము బెట్టి క్రుక్కి యద – లించుచు నొక్కుక తాకు తాకన్
లింగ నమశ్శివాయ గురు – లింగ మహేశ్వర జంగమయ్య యో
యంగజభంగ సాంబ గురు – డా యను దాకిన తాకుతాకున్॥

ఉ॥ నీతి యొకింతలేక ధరణీస్థలి నవ్వాడు ద్రోహి లేడటే
హేతువు మాని నమ్మి చెడి – హీనత నొందిన నాకు నేని యీ
చేతన ముండగా నిపుడె – సిగ్గున గుద్దయు నోరుమూయ ని
చేతులు రొండునాకు దయ – చేసిన దేవుని సన్నుతించెదన్॥

ఉ॥ కాగల కార్యముం జెరుప – గా యువనీశులు కొందఱెన్నియో
వాగి యబద్ధముల్పలికి – భంగమొనర్ప దలంచు చుందు రా
బాగును మాన్పజాలరు స్వ – భావము వెల్లడి యాటగాని సం
భోగపువేళ నడ్డుపడు – సోమరి తప్పము లడ్డుపోలికన్. ౧౬


[illegible]రపంచకము – సంపూర్ణము

